

బాలనేరస్థులను క్రమమార్గంలో పెట్టడానికి బొంబాయి
రాష్ట్రం కృషి చేస్తున్నది.

Kakaraparty Venkata Subbarao.

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును

**Founder: K. NAGESWARA RAO**

సంపుటము **44**
సంచిక **11**
**14-11-51**

ఖర సంవత్సర కార్తీక బహుళ పాడ్యమి బుధవారము


రాజకీయాలు:

## ఆహారం, ఆచారం:

మనకు కావలసినంత బియ్యం విదేశాలనుంచి దిగుమతి చేసుకోడం కష్టమని చెప్తూ, మన రాష్ట్రంలో ప్రజలు అలవాట్లు మార్చుకోడం అవసరమని భారత ప్రధాని పండిట్ నెహ్రూ సూచించారు.

మద్రాసు అసెంబ్లీలోనూ, లెజిస్లేటివ్ కౌన్సిల్‌లోనూ ఆహారసమస్య గురించి జరిగిన చర్చల సారాంశాన్ని తెలియపరుస్తూ మద్రాసు ముఖ్యమంత్రి కుమారస్వామి రాజాగారు మద్రాసు రాష్ట్రంలో ఆహారధాన్యాల కొరత గురించి ప్రధాని నెహ్రూకు ఒక లేఖ వ్రాశారు. బర్మా దేశంలో పంట బాగుందని కబురు తెలిసినందువల్ల బర్మా ప్రధాని ఢిల్లీలో ఉన్న అదనులోనే ఆయనతో మాట్లాడి ఈ సంవత్సరం పదిలక్షల టన్నులు బియ్యం దిగుమతి చేసే ఏర్పాటు చేయించవలసిందని మద్రాసు శాసనసభ్యులు ఇచ్చిన సలహాను కుమారస్వామిరాజాగారు నెహ్రూకు నివేదించారు. ఈ సంవత్సరం వర్షాభావంవల్ల పంటలు మళ్ళీ పాడైనాయనీ, వచ్చే సంవత్సరానికి ఆరులక్షల టన్నులు బియ్యం మద్రాసు రాష్ట్రానికి సప్లైఅయితేకాని తొమ్మిదౌన్సులరేషన్ ఇవ్వడానికి కూడా వీలుండదనీ ముఖ్యమంత్రి నెహ్రూకు తెలియపరిచారు.

ఈ సంవత్సరం బియ్యం సప్లై బొత్తిగా తక్కువై పోయినందువల్ల దేశమంతటా ప్రజలు ప్రభుత్వంపట్ల అసంతృప్తి చెందుతున్నారని ముఖ్యమంత్రి వ్రాశారు.

రాయలసీమ జిల్లాలలోనూ సర్కారు జిల్లాలలో రేషనింగ్ అమలు జరిగిన పట్టణాల్లోనూ క్రమంగా ఆరు ఔన్సుల రేషన్ కూడా సప్లై చెయ్యలేక పోయినట్లు ప్రభుత్వం ఒప్పుకుంటోనే ఉంది. రైళ్ళలో బియ్యపుమూటలు రవాణా కాకపోయినట్లయితే, ధర ఎంత అధికంగా ఉన్నా బ్లాక్ మార్కెట్ బియ్యం కూడా దొరక్కపోతే నిత్యం క్షామప్రాంతమైన రాయలసీమలోనే కాక కరువెరగని డెల్టా జిల్లాలలోకూడా ప్రజలు మలమలమాడిపోయేవారని చెప్పక తప్పదు. బ్లాక్ మార్కెట్ బియ్యమే సర్కారు జిల్లాలలో కాటకం రాకుండా కాపాడగలిగిందని అందరూ ఒప్పుకుంటారు. దీనినిబట్టే ధాన్యసేకరణా, బియ్యం పంపకం ఎంత లోపభూయిష్ఠంగా ఉన్నాయో గ్రహించవచ్చును. ప్రభుత్వం సేకరణ పంపకాల నిర్వహణను సరిదిద్దుకుంటే, చాలవరకూ ఈ కొరతబాధ ఉండదేమో ననిపిస్తుంది.

ముఖ్యమంత్రికి సమాధానమిస్తూ ప్రజలెంత అసంతృప్తి ప్రకటించినా బియ్యం పుట్టదని నెహ్రూ వ్రాశారు. నిత్యం ఆహారవస్తువులు దిగుమతి చేసుకోవాలని వాదించడంలో అర్థం లేదన్నారు. ఎక్కడనుంచో తెచ్చుకోవచ్చునని ఆశలు పెట్టుకుంటే అది ఆత్మవంచన చేసుకోడమే నన్నారు. ఆహారసమస్యా పరిష్కారంలో ముందెంత దిగుమతి చేసుకోవాలని అంచనా వేసుకోవడంకంటే, అలవాట్లు మార్చుకోడం అవసరమని నెహ్రూ చెప్పారు.

అలవాట్లు మార్చుకోడం అనుకున్నంత కష్టంకాదు. రాయలసీమవాసులు జొన్నలు మాని బియ్యానికి అలవాటుపడం అనుభవమే. కొంత గోధుమ విధిగా చేర్చుకుని బియ్యంకొరవ బాధను నివారించుకోడం అవసరమే అవుతుంది. కాని గోధుమైనా మనకి సక్రమంగా లభిస్తుందా అనే విషయం సందేహం. గోధుమ తెచ్చుకోవాలంటే ఇప్పటికంటె అధికంగా కేంద్రప్రభుత్వంపైనా, ఉత్తరాది రాష్ట్రాలపైనా ఆధారపడవలసిన అగత్యం కలుగుతుంది. విదేశాలపైని ఆధారపడ్డంకంటె ఉత్తరాది రాష్ట్రాలపైనే ఆధారపడ్డం మంచిదని కొందరనవచ్చు. కాని విదేశాలనుంచి స్వయంగా దిగుమతి చేసుకుంటున్నారు కాబట్టి ఆ ఆహారధాన్యాలను కేంద్రప్రభుత్వం మనకు సులువుగా పంపగలుగుతోంది. అదే ఉత్తరాది రాష్ట్రాలనుంచి తెచ్చుకోవాలంటే ఎంత కష్టమో కేంద్ర ప్రభుత్వానికీ అనుభవమే, మనకీ అనుభవమే. పంజాబ్‌నుంచి కంట్రోల్ ధరలకు ధాన్యాన్ని తెచ్చుకోడం ఎంత కష్టమయిందో కేంద్ర ఆహారమంత్రి మున్షీగారే ఇదివరలో తెలియచేశారు. పంజాబ్ ప్రభుత్వం హెచ్చుధరలకు గాని ఆహారధాన్యాలను అమ్మబోరని చెప్తూ, కేంద్రప్రభుత్వం ఆజ్ఞలను ధిక్కరించింది. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాన్ని ధరతగ్గించవలసిందని కేంద్రప్రభుత్వం కోరినప్పుడు అసంభవమని ఆ రాష్ట్రప్రభుత్వం తెలియచేసింది. దీనివల్ల మద్రాసురాష్ట్రప్రభుత్వం ఇక్కడి ధర కంటె ఎక్కువ ధరలకు ఉత్తరప్రదేశ్ నుంచి ధాన్యాలు తెచ్చుకుని నష్టానికి అమ్మవలసి వచ్చింది.

ఇకముందు గోధుమ అలవాటుచేసు

వంటే నిత్యం ఉత్తరాది రాష్ట్రాలపైన ఆధారపడవలసి ఉంటుంది. ఈనాడు, అమెరికా, చీనా దేశాలిచ్చిన గోధుమ పుష్కలంగా ఉన్నందువల్ల బియ్యంవాడే వారిని అలవాట్లు మార్చుకోమంటే, ముందు ముందు చిక్కులు పడవలసి రావచ్చును.

## ధాన్యసేకరణ, ధరలు

పశ్చిమబెంగాల్ మొదలైన రాష్ట్రాలలో మాదిరిగానే మద్రాసు రాష్ట్రంలో కూడా ఈ సంవత్సరం వరిపంట బాగా తగ్గిపోయిందనీ, పొగాకు, చెరకు మొదలైన పంట అధికమాతున్నాయనీ ఇటీవల మద్రాసు ప్రభుత్వ ఆర్థికవిషయ సలహాదారు నటరాజన్ గారు ప్రభుత్వానికి నివేదించారు. దీనికి కారణం వరిపంటవల్ల రైతుకు వ్యవసాయపు ఖర్చులు పెరుగుతూనే వున్నాయనీ, కంట్రోల్ ధరలు మాత్రం నిలకడగానే ఉండిపోవడంవల్ల రైతుకు మిగిలేది నానాటికి తగ్గిపోతూ వుందనీ చెప్పారు. ఇప్పటికి నాలుగేళ్లుగా అతివృష్టి, అనావృష్టులవల్లనూ, వరదలవల్లనూ పంటలు నష్టమై రైతుకు నష్టమే కాని లాభం కనపట్టంలేదు అందువల్ల రైతులు పొగాకు, చెరకు, పసుపు మొదలైనవి పండించి లాభాలతో తమ స్థితిని బాగుచేసుకోడానికి కృషిచేస్తున్నారు. దీనికి తోడు నాలుగేళ్ల అనుభవంతో భాగ్యవంతులైన రైతులు, మిల్లుయజమానులు ధాన్యసేకరణ అధికారుల్ని తప్పించుకుని ధాన్యం నిలవచేసుకోగలగడంవల్ల పైపైకి ధాన్యం కొరవ మరింత అధికంగా కనపడుతోంది.

సేకరించిన ధాన్యాన్ని ప్రభుత్వం జిల్లాప్రాంతాల అవసరాలతో నిమిత్తం లేకుండా ఒక్కవరసన ఇతర జిల్లాలకు పంపెయ్యడం వల్ల డెల్టా జిల్లాలలో ధాన్యాన్ని సేకరణాధికారుల కివ్వకుండా నిలవఉంచేవారిని అన్నితరగతుల ప్రజలూ బలపరుస్తున్నారు. స్వంత అవసరంకోసం తప్ప లాభాలకోసమైతే వరి పండించడం అనవసర మనుకునే ఈ రోజుల్లో రైతుల వద్దనుంచి ధాన్యం సేకరించడం కాని, సేకరణ ప్రజలతోడ్పాటు పొందడం కాని ఎంత దుర్ఘటమో ప్రభుత్వానికి అనుభవమౌతోంది. అందువల్ల ధాన్యం కంట్రోల్ ధరలను నూటికి పదివంతుల చొప్పున హెచ్చించడానికి అనుమతివ్వాలని మద్రాసు ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని కోరింది. కేంద్రప్రభుత్వం మొదట నిరాకరించింది కాని ఇప్పుడు ఆహారశాఖామంత్రుల సమావేశంలో ఈ విషయాన్ని చర్చించవచ్చునని ఒప్పుకుంది.

ధరలను పెంచితే కొనుగోలుదార్లకు బ్రతుకు మరింత కష్టమయ్యే మాట నిజమే. కాని ఇతర రాష్ట్రాలలో హెచ్చు ధరలకు అమ్ముతున్నందువల్ల అక్కడ ప్రజ లెంత కష్టపడుతున్నారో, అంతకంటె మనకి ఎక్కువ కష్టం ఉండదు బట్టధర నూటికి 30 వంతులు పెరిగినందువల్ల ప్రజలలో చెలరేగిన అసంతృప్తినీ, వా రనుభవిస్తున్న కష్టాలనూ చూసి ప్రభుత్వం ఓర్చగలుగుతోంది. అలాగే ఇదీ అని సరిపెట్టుకోకపోతే, దేశానికంతకీ ఆహారం సప్లైచెయ్యవలసిన రైతులు నష్టానికి వ్యవసాయం చేస్తా రనుకోడం భ్రమ. ఇప్పుడీ కష్టానికి తలొగ్గకపోతే ధాన్యసమృద్ధంగా ఉన్న డెల్టా జిల్లాలలో వరి పంట మరింత సన్నగిల్లి కరువు రాగల ప్రమాదం ఇప్పుడు కాకపోతే కొద్ది ఏళ్లలోనే సంభవించవచ్చు.

## మైసూరు కేసు

విషప్రయోగంవల్ల మైసూరు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిని హత్య చెయ్యడానికి యత్నించినట్లు శ్రీ యల్. యస్. రాజు (మైసూరు న్యాయవాది) పైన తేబడిన అభియోగం సందర్భంలో మైసూరులో చిత్రమైన వివాదం చెలరేగుతోంది. కేసులో ప్రధాన సాక్షి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తే కావడంవల్ల కేసు విచారణను మైసూరు సంస్థానంనుంచి మరొకచోటుకు మార్చాలని ముద్దాయిచేసిన విజ్ఞప్తి నిరాకరించబడింది.

కేసుకు సంబంధించిన పరిస్థితుల దృష్ట్యా న్యాయమూర్తివల్లకాని, జూరీవల్లకాని నిష్పక్షపాతమూ సక్రమమూ అయిన విచారణ జరగదని సంశయానికి తావున్నప్పుడు అలా మార్చాలని ఆజ్ఞ ఇచ్చే అధికారం కోర్టులకేకాక క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 527 వ సెక్షన్ క్రింద రాష్ట్రప్రభుత్వానికి కూడా ఉంటుంది. మార్చాలావద్దా అనే నిర్ణయం రాష్ట్రప్రభుత్వానిదే.

కేంద్రప్రభుత్వం ఈ విషయమై రాష్ట్రప్రభుత్వంతో సంప్రదించి, కేసును మద్రాసు బొంబాయి రాష్ట్రాలలో ఒక కోర్టుకు మార్చవలసిందనీ, అది సమ్మతం కాకపోతే ఆ రాష్ట్రాలకు చెందిన ఒక జడ్జిని నియమించుకుని మైసూరులోనే విచారణ జరిపించవలసిందనీ సూచించారు. కాని మైసూరు ప్రభుత్వం ఇందుకు సమ్మతించలేదు. ఇంక భారతప్రభుత్వానికి మార్గాంతరం లేకపోయింది. 371 రాజ్యాంగ నిబంధన ప్రకారం రిపబ్లిక్ అధ్యక్షుడు కేసును

[47-వ పేజీ చూడండి]

## సవరణ

ఈ సంచికలో 14 వ పేజీలోని "అల్లుగాడి పెళ్లి" శ్రీ భమిడిపాటి రామగోపాలం గారి రచన, 17 వ పేజీలోని "నిలువుటద్దం" శ్రీ అనుముల వెంకటశేషకవిగారి రచన. పాఠకులు సవరణ గమనింతురుగాక.

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

## అలెగ్జాండర్ డ్యూమా

## 73

కాంట్ మార్సెర్ఫ్‌ను అవమానించి పంపివేసిన రోజు సాయంకాలమే డాంగ్లర్ ఆంద్రీతో రహస్యమంతనాలారంభించాడు. డాంగ్లర్ స్వయంగా యూజినీ వివాహ ప్రసక్తి తేనక్కరలేకుండా ఆంద్రీయే తన మనోవాంఛను ముందు వెలిబుచ్చాడు. తన పాచిక పారినందుకు లోలోన సంతోషిస్తూ, అయినా పైకి తన తొందరపాటు తెలియనీయరాదనే ఉద్దేశంతో డాంగ్లర్ ఇలా అన్నాడు: "ఆంద్రీ! అప్పుడే వివాహం తలపెట్టడానికి మీ కింకా వయస్సు నిండలేదే!"

"అంటే నా తండ్రిగారి అనుమతినిగురించి మీరు సంకోచిస్తున్నారా? సంకోచం అనవసరం. నేను పారిస్‌లోనే స్థిరపడిపోతానని నా తండ్రిగారికి తెలుసును. అందువల్ల నే నిక్కడే వివాహం చేసుకుని స్థిరపడేపక్షంలో నా జరుగుబాటుకోసమని ముందే కొంత ధనం ఏర్పాటుచేశారు కూడా."

"అయితే సరే. నా కూతురుకి కొంత కట్నమివ్వాలనుకున్నాను. నా అనంతరం నా ఆస్తికి ఆమే వారసురాలు."

"అయితే మరీ మంచిది. నేను కోరినట్లయితే ఇక్కడే కొంత పెట్టుబడిపెట్టి వ్యాపారం చేసుకోడానికి నా తండ్రి పెట్టుబడి ధనంకూడా ఇస్తారు. అది మీ చేతికే ఒప్పగిస్తాను మీరే వ్యాపారంలో పెట్టి వృద్ధిచెయ్యండి."

"ఓ! తప్పకుండా. అయితే నా కూతుర్ని మీ కివ్వడం నాకు సమ్మతమే. నా భార్య కూతురుకూడా అభ్యంతర పెట్టరు లెండి."

"ఇద్దరూ పరస్పరాభినందనాలతో మంతనం ముగించి లేచారు.

ఆంద్రీ బగ్గీఎక్కి బయలుదేరాడు. పరిచారకుడు అతని చేతికొక చీటీ యిచ్చి రెండువందల ఫ్రాంకులు ఒప్పగించాడు.

"ఇదేమిటి?" అన్నాడు ఆంద్రీ.

"అతను పుచ్చుకోనన్నాడండి. ఈ చీటీ మీ కివ్వమని చెప్పాడు."

ఆంద్రీ చీటీ చూసుకున్నాడు: "నా మకాం నీకు తెలుసును. రేపు పొద్దున్న తొమ్మిదిగంటలకి తప్పకుండా రా." అని వుంది. కాడరూస్ మూర్ఖత్వానికి ఆంద్రీకి కోపంవచ్చింది. పళ్ళు పటపట కొరికాడు. కాని వేరే చేసేదిలేక మరునాడుదయం కాడరూస్ మకాం చేరుకున్నాడు.

"రారా! నువ్వు వస్తావనే అనుకున్నాలే" అన్నాడు కాడరూస్ వికృత మందహాసంతో.

"చాల్లే! ఘనకార్యం చేశానని కులుకుతున్నట్టున్నావు"

"అదుగో! మళ్ళీ కోపం తెచ్చుకుంటున్నావు. నువ్వు వస్తావని నీకోసం ఫలహారం తయారుచేయించాను చూడు."

"ఇందుకోసమేనా నన్ను రమ్మన్నది."

"అహ! తొందరపడకు మరి, సావధానంగా చెప్తానురా. పాతమిత్రుణ్ణి చూడాలనుకోడం తప్పుకాదు కదా!"

"మిత్రుడవు కాదు నువ్వు. ద్రోహివి. నీకు ప్రతిమాసం రెండువందలివ్వడానికి ఏర్పాటుచేసిన తరవాత ఇంకా నన్ను వేధించడమెందుకు?"

"ఇస్తున్నావు ముష్టి రెండువందలు. చూడు నా బతుకెలా నికృష్టంగా ఉందో, నిజంగా నీ కది ఇవ్వడం ఇష్టం లేదని నాకు తెలుసును."

"అది కాదు నీ కెంత ఇచ్చినా తృప్తి అనేది ఉండదు."

"నాదగ్గిర చెప్పకు. నీ అదృష్టం పండింది లే నీ కేం! డాంగ్లర్ కూతుర్ని పెళ్ళిచేసుకోబోతున్నావు."

"డాంగ్లర్ పేరు ఉచ్చరించడానికే నా తగవు నువ్వు!"

"ఏమిటీ! డాంగ్లర్ మాట నాదగ్గిరా చెప్తున్నావు? నేనూ అతను ఇదివరలో స్నేహితులమన్న సంగతి నీకు తెలియదు కాబోలు."

"అదంతా ఇప్పుడెందుకులే. న న్నెందుకు రమ్మన్నావో చెప్పు."

"నా కొక ఆలోచన తట్టింది. ప్రతినెలా ఎప్పుడు డాఖరవుతుందా అని లేచికూర్చోడం నాకు బాధగా ఉంది. నే నీ స్థితిలో ఉంటే, ఎక్కడో ఇల్లు కొనుక్కోడానికని ఆరునెల్ల డబ్బు ముందిమ్మని అడిగి, అది తీసుకుని పరారవుతాను."

"నువ్వే ఇప్పుడా పనెందుకు చెయ్యకూడదు?"

"ఏమిటి? పన్నెండు వందల్తోనా?"

"అబ్బ నీ లోభానికి మితిలేదు. రెణ్ణెల్లముందు నీకు తిండి కూడా లేదు. ఇప్పుడదేదో ఏర్పాటుచేసినా నీకు చాలడం లేదు. ఆశ ఎక్కువౌతోంది."

"తిన్నకొద్దీ ఆకలెక్కువైనట్టు. నా ఆలోచన చెప్తా విను. నువ్వు చిల్లిగవ్వ ఖర్చుపెట్ట నక్కర్లేకుండా, నాకు ముప్పైవేలు సంపాదించుకోడానికి వీలివ్వగలవు."

"అది నావల్ల కాదు."

"నే చెప్పేది నువ్వు అర్థం చేసుకోడంలేదు. నువ్వు చిల్లిగవ్వ ఖర్చుపెట్టనక్కర్లేదంటున్నాను. అది సరె. ఈలోగా నా కిచ్చేది నెలకి ఐదువందలకి పెంచు."

"పెంచితే ఇంకా నన్ను వేధించడం మానేస్తావా? నువ్వేమో స్నేహితుడవనుకున్నాను. నీ కొక రహస్యం చెప్తాను వింటావా?"

"చెప్పు."

"నా తండ్రి ఎవరో తెలుసుకున్నాను."

"ఎవరు?"

"కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో."

"అబ్బే!"

"అవును. కాని ఆ విషయాన్ని ఆయన పైకి తెలియనివ్వలేదు. అందువల్ల మేజర్ కావల్కాంటీవల్ల నాకీ సహాయం చేస్తున్నాడు. నా తండ్రినని చెప్పకుంటున్నందుకు ఆయనకి ఏభైవేలిస్తున్నాడు."

"అబ్బా! నీ తండ్రి అనిపించుకోడానికి ఏభైవేలే!

అనువాదం: సీతారామ్

అందులో సగమిస్తే నేనే ఆ పని చేద్దునే! మరి నీ కెంత ఇస్తున్నాడు?"

"మొత్తం అయిదు లక్ష లిస్తాడు."

"అబ్బ! అయిదులక్షలే!" అంటూ కాడరూస్ చేతిలో రొట్టిముక్క నలుపుతూ పరధ్యానంలో పడ్డాడు. కొంతసేపైన తరవాత "ఆయన చాల భాగ్యవంతుడా?"

"భాగ్యవంతుడా! ఆయన కెంత ధనముందో ఆయనకే లెక్క తెలీదు."

"అయితే అడ్డులేకుండా నిన్నాయన ఇంటిలోకి రానిస్తాడా?"

"ఓ! నా యిష్టంవచ్చినప్పుడు వెళ్లవచ్చు."

"ఇల్లెక్కడ?"

"శాంప్ ఎలిషీలో ముప్ఫైయో నంబరు"

"నీకా ఇల్లు లోపలా బయటా బాగా తెలుసునా."

"ఆ."

"అయితే అచోక్కి అంతా చెప్పు."

మాంట్ క్రిస్టో ఇంటి నమూనా కాగితంమీద గీసి వివరాలన్నీ ఆంద్రీ విశదంగా చెప్పాడు. మాంట్ క్రిస్టో ఇంటిలో ఎప్పుడుంటాడో, ఎప్పుడు ఉండనిదీ కూడా చెప్పాడు.

"ఇంతేనా? ఇంకేమైనా ఉందా?" అన్నాడు ఆంద్రీ

"ఇంక చాలు నా పని నేను నెరవేర్చుకుంటాలే నీకు నాబాధ కూడా విరగడౌతుంది." అంటూ కాడరూస్ వికృతంగా నవ్వాడు. ఆంద్రీ కోపంపట్టలేక, ఏమీ చెయ్యలేక వేలు కొరుక్కుంటూ లేచాడు. ఆంద్రీ ద్వారం సమీపించేసరికి కాడరూస్ "ఆగు" అన్నాడు. ఆంద్రీ వెనక్కి తిరిగిచూశాడు.

"నీవేలి నున్న ఆ ఉంగరం బాగుంది ఏదీ చూడనీ" అన్నాడు కాడరూస్. ఆంద్రీ ఉంగరం తీసి మేజామీదకి విసిరాడు

"నామాట నువ్వెప్పుడూ కాదనవన్న సంగతి నాకు తెలుసును. కాని ఇది నిజమైన వజ్రమేనా?"

"ఆంద్రీ జవాబివ్వలేదు

"నేను భాగ్యవంతుణ్ణి కాకపోయినా నాకూ వజ్రాల సంగతి తెలుసులే. ఇది మంచిదనో కాదో చూసి చెప్తానుండు." అంటూ కాడరూస్ లేచి ఉంగరం పట్టుకుని కిటికీవద్దకు వెళ్ళి వజ్రంతో గాజు తలుపుపైన గీశాడు. గాజుముక్క సన్నగా చీరుకుపోయింది. "అసలైన వజ్రమే" అన్నాడు కాడరూస్. ఆంద్రీ విసుగుదలతో మాటైనా వినిపించుకోకుండా గబగబ వెళ్ళిపోయాడు.

మరునాడు సాయంకాలం మాంట్ క్రిస్టో ఆటేల్‌లోని తన ఇంటికి బయలుదేరనున్న సమయంలో అతని కొక లేఖవచ్చింది. అందులో ఇలా ఉంది: "ఈ రాత్రి శాంప్ ఎలిషీలోని మీ యింటిలో సొత్తు హరించడానికి ఒక దొంగ రానున్నాడు. పోలీసుల సహాయంతో నిమిత్తం లేకుండా మీ రొక్కరూ పరిచారకుల సహాయంతో మీ సొత్తు కాపాడుకోగలరు. పోలీసుల్ని మీరు పిలిచినట్లయితే, మీ క్షేమం కోరుతున్న నాకు ముప్పు రాగలదు. ఈ రాత్రికి మీరు ఇల్లువదలి వెళ్ళడం శ్రేయస్కరం కాదు. ఈ రాత్రి మీ యింటికి రానున్న మనిషి దొంగమాత్రమే కాదు. మీ ప్రచ్ఛన్న శత్రువుకూడా. ఆ శత్రు వెవరో తెలుసుకోడానికి మీకిది మంచి అదను"

లేఖ ఎవరువ్రాశారో తెలియదు. మాంట్ క్రిస్టో కొంతసేపు యోచించాడు. 'నా ప్రచ్ఛన్నశత్రువు ఎవరు? నా పత్రాల కోసం వస్తాడా? కాదు. బహుశా నన్ను చంపడానికే వస్తాడను కుంటాను." అనుకున్నాడు మనస్సులో. వెంటనే ప్రయాణం విరమించుకుని, ఆలీ ఒక్కడినీ తప్ప తన పరిచారకుల్నీ, ఉద్యోగుల్నీ అందరినీ ఆటేల్ భవనానికి పంపివేశాడు. మేడపైన కిటికీలు ఎప్పటిమాదిరిగానే తెరిచి ఉంచాడు. ఇంటికి పైన, కింద తాళాలు వేయించాడు. ఆలీ తనూ కలిసి చీకటిపడేవేళకి వీధిలోకి వచ్చారు. వీధిలో ఎక్కడా జనసంచారం లేదు. గంట తరువాత మెల్లిగా ఇద్దరూ కలిసి వెనకగోడ దూకి ఇంటిలోకి ప్రవేశించారు. ఒక కిటికీగుండా ఇద్దరూ పడకగది ప్రవేశించారు. ఆలీని అక్కడే ఉండమని సంజ్ఞచేసి మాంట్ క్రిస్టో పక్క సావడిలోకి వెళ్లాడు. బీరువా తాళాలు గట్టిగా లాగిచూశాడు. తరవాత పడకగదిలోకి వచ్చి తలుపులు దగ్గరగా మూశాడు. రెండు రివాల్వర్లు జేబులో సిద్ధపరుచుకున్నాడు. ఇద్దరూ నిశ్శబ్దంగా నిరీక్షిస్తూ కూర్చున్నారు.

రాత్రి పన్నెండు గంట లయింది. చీకటిలో వీధిలో గోడవారని ఒక వ్యక్తి రావడం ఇద్దరూ చూశారు. మొదటి వ్యక్తికి కనపడకుండా మరొకవ్యక్తి చీకటిలో వెన్నాడుతున్నాడు. కొంతసేపైన తరవాత సావడిలో అస్పష్టమైన సవ్వడి వినవచ్చింది. గాజు తలుపు కోస్తున్న చప్పుడు సన్నగా వినపడుతోంది. ఆలీ కిటికీలోనుంచి వెనకవీధివంక చూశాడు. రెండోవ్యక్తి నిలబడి దొంగని జాగ్రత్తగా కనిపెడుతున్నాడు. ఇంకెవ్వరూ కనపడలేదు. తరవాత అస్పష్టంగా కరకరశబ్దం వినపడింది "కిటికీ తలుపు కోసేశాడు." అనుకున్నాడు మాంట్ క్రిస్టో. గాజుముక్క తియ్యగా ఏర్పడిన సందులో చెయ్యి చొనిపి కిటికీతలుపు గడియ తీశాడు దొంగ. మెల్లిగా తలుపుతెరిచి లోనికి ప్రవేశించాడు. జేబులోనుంచి తాళపుచెవులగుత్తి తీసి బీరువాతాళం తియ్యడానికి దొంగ ప్రయత్నించ నారంభించాడు. "శత్రువు కాడు. దొంగ మాత్రమే" అనుకున్నాడు మాంట్ క్రిస్టో.

మాంట్ క్రిస్టో పడకగదిలోని ఒక బీరువా తెరిచి పొడుగైన నల్లని ఉక్కుతీగెల కోటుతీసి ధరించాడు. దానిపైన ఫాదరీ దుస్తులు ధరించాడు. మాసెంచల టోపీ ఒకటి తలపై పెట్టుకున్నాడు.

మెల్లిగా తలుపు ఓరగా తెరిచిచూశాడు. దొంగ బీరువా తాళాన్ని బలమైన కత్తితో పెగల్చడానికి ప్రయత్నించడం గమనించాడు. మెల్లిగా సావడి ప్రవేశించాడు. తాళం పగలగొట్టే యత్నంలో నిమగ్నుడైయున్న దొంగ మాంట్ క్రిస్టో ప్రవేశించడం గమనించలేదు. మాంట్ క్రిస్టో కొవ్వొత్తి ఒకటి తీసి వెలిగించాడు. దొంగ ఉలిక్కిపడి వెనక్కు తిరిగాడు. "కాడరూస్! ఈ అర్ధరాత్రివేళ ఇక్కడేం చేస్తున్నావ్!" అన్నాడు మాంట్ క్రిస్టో. నిర్భయంగా కిటికీవద్దకు వెళ్లినిలిచాడు. కాడరూస్‌కి ఇంక పారిపోడానికిదారిలేదు. "ఎవరు! ఫాదరీ! బుసోనీ!" అన్నాడు కాడరూస్ తడబడుతున్న మాటలతో.

"అవును. మాంట్ క్రిస్టోసొత్తు దోచుకోవాలనివచ్చావు కాదూ?"

కాడరూస్ దారికోసం చుట్టూ చూశాడు. లాభంలేక

పోయింది. గజగజవొణికిపోతూ నిలబడిపోయాడు. అతనికిముచ్చెమటలు పట్టాయి.

"అయితే ఇంకా నీహంతక వృత్తి మానలేదన్నమాట."

"ఫాదరీ! కడుపుమంట నన్నీ పనిచేయించింది. నన్ను క్షమించండి."

"పాపాత్ములంతా ఇదేఅంటారు."

"నిర్భర దారిద్ర్యం..."

"ఇశ్శీ! నగలవర్తకుడువజ్రపు టుంగరానికి నీకు నలభై అయిదు వేలిచ్చినప్పుడు ధనమూ వజ్రమూకూడా తీసుకోవాలనే లోభంతో అతన్ని హత్యచేసినప్పుడు దారిద్ర్యమే కారణమయిందా?"

"ఫాదరీ! మీరొక్కరేనా ఇంకెవరైనా ఉన్నారా? పోలీసులు వచ్చారా?"

"లేదు. నేను ఒంటరిగానే ఉన్నాను. ఆఖరుసారినిన్ను కనికరించి విడిచిపెడుతున్నాను. కానిఒకటి చెప్పు. అయితే అబద్ధం చెప్పకుసుమా! ఖైదునించి ఎలా విడుదలై వచ్చావు?"

"లార్డ్ విల్మోర్ సహాయం చేశారు."

"అతను నీ సంరక్షకుడా?"

"కాదు. నాతోటి ఖైదీకి అతను సంరక్షకుడు."

"ఎవరా ఖైదీ?"

"బెనెడెట్టో"

"అతను కూడా నీతోపాటు విడుదలైనాడా?"

"అవును. ఇద్దరం కలిసే పారిపోయాం. విల్మోర్ ఇచ్చిన ఆకురాయితో ఊచలు కోసి బైటపడ్డాం."

"బెనెడెట్టో ఏమైనాడు?"

"నాకు తెలియదండి."

"నీకు తెలుసును."

"దైవసాక్షిగా చెబుతున్నాను. నాకు తెలియదండి." అంటూ చేతులు జోడించి ఫాదరీని సమీపించాడు కాడరూస్ ఫాదరీ కదలకుండా అలాగే నిలబడ్డాడు. "అబద్ధం" అన్నాడు గంభీరంగా.

"ఫాదరీ! క్రీస్తుసాక్షి."

"పారిస్ వచ్చినతరవాత నీ జీవనోపాధి ఏమిటి?"

"చేతికి చిక్కింది తీసుకుని పొట్టగడుపుకుంటున్నానండి."

"అబద్ధం."

కాడరూస్ గజగజ లాడాడు.

"అత నిచ్చిన డబ్బుతో గడుపుతున్నావు" అన్నాడు బుసోనీ.

కాడరూస్ నిశ్చేష్టుడైనాడు: "నిజమేనండి. అత నొక భాగ్యవంతుని కొడుకైనాడు."

"ఎవ రా భాగ్యవంతుడు?"

"కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో."

"ఏమిటి? బెనెడెట్టో మాంట్ క్రిస్టో కొడుకా?" అన్నాడు మాంట్ క్రిస్టో తెల్లబోయి. "ఇప్పుడా కొడుకు ఏపేరు పెట్టుకు తిరుగుతున్నాడు?"

"ఆంద్రీ కావల్కాంటి."

"మాంట్ క్రిస్టో ఆదరించిన ఆ యువకుడేనా? డాంగ్లర్ కూతుర్ని పెళ్ళిచేసుకోబోతున్నవాడేనా?"

"అవునండి."

"అంత మోసం జరుగుతోంటే నువ్వు చూస్తూ ఊరుకున్నావా కాడరూస్? ఎంత పాపాత్ముడవ్! నీ కతని నికృష్టజీవితం దుర్వర్తనా తెలియవా?"

"తెలిస్తేమాత్రమేం? మిత్రుడు బాగుపడుతోంటే నే నెందుకు చెడగొడతాను?"

"ఈ మోసమంతా బయట పెట్టేస్తాను."

"ఎవరికి చెప్తారు?"

"డాంగ్లర్ కి."

"ఆ! ఆ!" అన్నాడు కాడరూస్. ధరాలున జేబులో కత్తితీసి బుసోనీ ఛాతీపైన పొడిచాడు. కాని కత్తి ఛాతీ పైన దిగకపోగా వంకరపోవడం చూసి కాడరూస్ నిర్ఘాంతపోయాడు. వెంటనే బుసోనీ కాడరూస్ చెయ్యిపట్టుకుని మెలితిప్పాడు. బుసోనీ చేతులో ఇంత మహాబలం ఉందని కాడరూస్ కలనైనా అనుమానించలేదు. చెయ్యిమణికట్టు వెణికి విపరీతమైన బాధ కలిగింది. ఫాదరీకాళ్ళముందు మోకరిల్లాడు. "రక్షించండి" అని దీనంగా ప్రార్థించాడు.

"ఛీ! నిన్ను శిక్షించక ఎందుకు విడిచిపెడుతున్నానో నాకే తెలియడంలేదు."

"అబ్బ! ఎంత బలం మీది!" అన్నాడు కాడరూస్.

"అవును. నీ వంటి పశువుల్ని లొంగదియ్యడానికే భగవంతుడు నాకీ బలమిచ్చాడు—నేను భగవత్కార్యాలు నిర్వహిస్తున్నాను ఇదిగో కలం, కాగితం. నే చెప్పినది వ్రాయి."

కాడరూస్ మారుమాట లేకుండా కలం తీసుకున్నాడు. బుసోనీ చెప్పగా ఇలా వ్రాశాడు: "అయ్యా, మీరు సన్మానించి మీ కూతుర్నిచ్చి వివాహం చేదామనుకుంటున్న యువకుడు తూలన్ ఖైదునుంచి పారిపోయివచ్చిన దగాకోరు. ఆ ఖైదులో అతని పేరు 59 నంబరు, నా పేరు 58 నంబరు. అతని మొదటిపేరు బెనెడెట్టో. కాని అతనికి తన తలిదండ్రు లెవరో తెలియదు. అతని పుట్టుక వంశం తెలియవు"

"సంతకం పెట్టు"

కాడరూస్ సంతకం చేశాడు. తరవాత డాంగ్లర్ చిరునామా వ్రాశాడు.

బుసోనీ కాగితం తీసుకుని "ఇంక నడు" అన్నాడు.

"నన్నేం చెయ్యదల్చుకున్నారు?" అన్నాడు కాడరూస్.

"నేనేం చెయ్యగలను? నిన్నుద్ధరించడానికి నా చేతనైనట్లు ప్రయత్నించాను నీకు ధనమిచ్చాను. కాని హంతకుడవైనావు."

"ఈ ఒక్కసారీ క్షమించండి. ఒక్కసారే! మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను."

"సరే. కాని ఈమాట మరిచిపోకు. నువ్వు క్షేమంగా వీధి దాటి ఇల్లు చేరుకోగలిగావా, వెంటనే పారిస్ నగరం విడిచిపో. నువ్వు సక్రమంగా ప్రవర్తించినంత కాలం నీకు చాలినా ధనం ఏర్పాటుచేస్తాను. ఇంక పో." అంటూ బుసోనీ కిటికీవంక చూపాడు.

కాడరూస్ కిటికీగుండా దూరి కిందికి దిగాడు. వెనుక ప్రాకారమెక్కి అవలివైపు నున్న నిచ్చెనమీదుగా క్రిందికి దిగ నారంభించాడు. మాంట్ క్రిస్టో చేతులు కట్టుకుని చూస్తున్నాడు. వీధిలో పొంచున్న వ్యక్తి తటాలున ఒక చెట్టు చాటున దాగడం మాంట్ క్రిస్టో చూశాడు.

కాడరూస్ నిచ్చెన ఆఖరు మెట్టుపై నుండగా రెండో వ్యక్తి చీకటి చాటునుంచి ఒక్క ఉదుటున వచ్చి కత్తితీసి కాడరూస్ ని వెన్నులో ఒక్కపోటు పొడిచాడు. కెవ్వున కేక పెట్టి కాడరూస్ వెల్లకిల పడ్డాడు. హంతకుడు ఛాతీ పైన రెండుపోట్లు పొడిచి పారిపోయాడు.

"అయ్యో! రక్షించండి. చచ్చిపోతున్నాను. పారిపోతున్నాడు" అని కాడరూస్ బిగ్గరగా అరవ నారంభించాడు.

(48-వ పేజీ చూడండి)

# దోమను చంపుడు

...అది మలేరియా—విడుపు జ్వరము—డెంగూ జ్వరము—కామాల జ్వరములను వ్యాపింపచేయును



దోమలు నిలువయున్న నీటియందు పుట్టును. గ్రుడ్డు నుండి పూర్తి దోమలగుటకు 8 రోజులు పట్టును. ఒకే చోట 8 రోజులకుపైగా నిలువయున్న ఏ నీరయినను దోమలు పుట్టుచోటు కావచ్చును.

దోమ మీ జీవితమునకు ఎప్పుడూ ప్రమాదకరమే, ఏలనన, అది వ్యాధి క్రిములను మోసికొనిపోవును— ఈ వ్యాధులలో మలేరియా ఒక్కటే ప్రతి సంవత్సరము భారత దేశంలో పదిలక్షల జనులను చంపుచున్నది.

జ్ఞప్తియుంచుకొనుడు: ఫ్లిట్ లోగల ఠ తీవ్రమగు కీటక నాశనులు దోమలను మరియు అన్ని కీటకములను త్వరగా, నిశ్చయముగా చంపును.

FLIT
"DDT"
KILLS

## ఫ్లిట్

మీరు ఖర్చు చేయు ప్రతి అణాకు
ఎక్కువ దోమలను చంపును

స్టాండర్డు-వాక్యూమ్ ఆయిల్ కంపెనీ (మెంబర్ల బాధ్యత పరిమితము)

# బొమ్మల పుస్తకం

## శ్రీ జీగేటి శివరామకృష్ణ

ఇంట్లో ఉత్తగా కూర్చుండటం యిష్టంలేక లలిత ధర్మారాయుణ్ని అడిగింది. 'ఏమయినా, పుస్తకాలు తెచ్చిపెట్టమని'

ఆడవాళ్ళు చదువుకోవాలనే అభిప్రాయం కల వాళ్ళలో ధర్మారాయుడొకడు. లలిత ఆవిధంగా తన అభిప్రాయం తెల్పటంతోటే, అతడికి ఆనందం కల్గింది. 'సరే తప్పక ఆమె కోరిన చక్కచక్కని పుస్తకాలన్నీ తెద్దామని మనస్సులో నిశ్చయం చేసుకొన్నాడు ధర్మారాయుడు! అయితే వెంటనే అతడు తన నిశ్చయాన్ని బయటపెట్టలేదు.

కొద్దికాలం లలితతో యీ విషయంలో తర్జనభర్జన జరిపాడు.

'పుస్తకాలెందుకూ?'—ఇది అతడడగవలసిన ప్రశ్న!

'కాలక్షేపం అవటంలేదు'

'కాలక్షేపానికేం, ఇరుగు పొరుగు అసమ్మనా, భోసమ్మను పిలిచి యేవో నాలుగు కబుర్లు చెప్పుతూంటే— అది జరిగిపోతుంది కాలక్షేపం'—ఈలా అంటూ ధర్మారాయుడు లలిత కండ్లలోకి చూశాడు!

లలిత యేం జవాబివ్వలేదు కాని,—ధర్మారాయుడివైపు తీవ్రంగా చూసింది.

ధర్మారాయుడే తిరిగి అన్నాడు: ఆపోపచేసిన వాళ్ళతో—కబుర్లు చెప్పటమే కాదు. అహస్యంగా—వీళ్ళమీద కిట్టని కబుర్లు వాళ్లవద్దా, వాళ్లమీద కిట్టనికబుర్లు వీళ్ళవద్దా చెబుతూంటే మరీ రంజుగా ఉంటుంది.'

ధర్మారాయుడు యింకా యేమో మాట్లాడబోయాడు. అయితే లలిత ఊరుకోలేదు. స్త్రీజాతిగౌరవం కాపాడటం— తనసొత్తిన ఉన్నదనుకొంది ఆమె. అందువల్ల ఉద్రేకంతో ఆమె జవాబిచ్చింది. "వాళ్ళమీద కబుర్లు వీళ్ళమీదా, వీళ్లమీద కబుర్లు వాళ్ళమీదా చెప్పుకోవటం మీ మగవాళ్ళకే చెల్లింది. అందరూ మీవిధంగానే ఉంటారనుకొన్నారా?"

ధర్మారాయుడి నెత్తిమీద పిడుగపడ్డట్లయింది. అతడు నవ్వుతూ ప్రశ్నించాడు! 'అయితే వీలు దొరకినప్పుడల్లా అరుగులమీద యెక్కి కబుర్లు చెప్పేవాళ్ళం మేమా మీరా?'

'ఇందులో ఒకరు యెక్కువా, మరొకరు తక్కువా తినలేదు. ఇరువురం సమానమే!'—లలిత జవాబిస్తూ, ధర్మారాయుడివైపు చూస్తూ నవ్వింది!

'ఏం' అన్నట్లుగా చూశాడామెవైపు ధర్మారాయుడు! 'మేం మగవాళ్ళు యిళ్లలో లేనప్పుడు కేవలం కాలక్షేపం కోసం వీధియెక్కి కబుర్లు చెప్పుకొంటూంటే మీరు—కేవలం—కబుర్ల కాలక్షేపం కోసం—పనిగట్టుకొని, యే పార్కువద్దకో, యే కాలవవొడ్డుకో, ఏ సినిమాహాలువద్దకో వెళ్ళుతూంటారు! ఏం?' ధర్మారాయుడు కొద్ది నిముషాలవరకు జవాబివ్వలేకపోయాడు! నిజానికి ఆమె అన్న మాటలో అసత్యమేముంది?

'అంతేగాదు, ఒకవేళ మేం యిరుగు పొరుగు వాళ్ళ నుగురించి—కిట్టనికబుర్లు చెప్పినా—అవి రహస్యంగానే ఉంచుకొంటాం. మీవిధంగా నడిరోడ్లమీద పడి, పోట్లాడుకోం. మార్గానపోయేవాళ్ళను గూర్చి మీవిధంగా చర్చసాగించం'

'చాలా జోరుగా మాట్లాడేవు. కొంచెం విశ్రాంతితీసుకో—అన్నాడు. ధర్మారాయుడు తగ్గిపోయి!

'చిత్తం— తమరావిధంగా సెలవిస్తే అలాగే కానిస్తాం అంది లలిత కొంటెగా!'

'అనవసరంగా మాట్లాడితే ఆయుర్దాయం తగ్గిపోతుంది. రొదరొద—ఒక గొడవ—మరి ఆనోటికి విశ్రాంతి ఉండదనుకొంటాను!'—అన్నాడు ధర్మారాయుడు! మీవిధంగా—హెచ్చుగా మాట్లాడేదాన్ని గాదు, అయితే మీమాటలమీద హెచ్చుగా నేనూ మాట్లాడవలసివస్తూంది. ...నిజం చెప్పండి. కాలక్షేపం అవటం లేదు ఏమయినా పుస్తకాలు తెచ్చిపెట్టండి అని అంటేగాదా యింత చర్చ జరిపారు.

'చిత్తం'

'సరే అంటే—మరి యింతదీర్ఘ చర్చ జరిగేదా? అనవసరపు మాటలు వొచ్చేవా?'—లలిత అంది!

'ఏలాటి పుస్తకాలు కావాలి?—ధర్మారాయుడు అడిగాడు'

'కథలు—నవలలు—పత్రికలూ'

'లైబ్రరీనుంచి తెచ్చేదా?'

'లైబ్రరీ పుస్తకాలే కాదు—మరి కొత్త కొత్త పత్రికలు గూడాను!

'సరే'అన్నాడు ధర్మారాయుడు!

ఈవిషయంలో మట్టుకు యిరువురిలోనూ రాజీ కుదిరింది. అందుకు మనం గూడా సంతోషించాల్సిందే!

* * *

మర్నాడే లైబ్రరీలో చందాదారుడిగా చేరి.. రకరకాల పుస్తకాలను యింటికి తేవటం మొదలెట్టాడు ధర్మారాయుడు!

అయితే లలిత అంతకుముందే—చాలా మట్టుకు పుస్తకాలు చదివేసింది. ఎంత కొత్త పుస్తకం తెచ్చినా న్చ్...చదివేసిందే'—అని చప్పరించేది లలిత! మరి దారి—.

మరి యెప్పటి కప్పుడు, కొత్త కథలతో కొత్తపోకడలతో వెలువడేవి పత్రికలు... లలితకు కావాల్సిందా పత్రికలు!

ఎన్నో విషయాల్లో ధర్మారాయుడు—లలితకు అడ్డకబుర్లు చెప్పేవాడు. లలిత అవునన్నది కాదనటం; కాదన్నది, అవునటం, అతనిపని అయిఉండేది. అయితే యీవిషయంలోమాత్రం అతడావిధంగా అభ్యంతరం చెప్పలేదు.

నెలకు పదిరూపాయలు లలిత చదువుకొనే పుస్తకాలకోసం ఖర్చుపెట్ట తీర్మానించుకొన్నాడు ధర్మారాయుడు. పేపరుకుఱ్ఱవాళ్ళతోగూడా చెప్పాడు—వచ్చిన కొత్తపుస్తకం అల్లా తమయింట యిస్తూండాల్సిందని.

ప్రతీనెలా రకరకాల పుస్తకాలు యింటికి వస్తూండేవి. లలితకు కాలక్షేపం జరుగుకుపోతూండేది. అయితే ఒక్కసారి చదివినపిదప—పత్రిక అంతే విలువ చేస్తుందనే ఉద్దేశం ఆమెకుండేది కాదు. 'అయ్యో,! ఎంత తెలివితక్కువదాన్ని—ఈ పత్రిక అనవసరంగా పుచ్చుకొన్నానే'—అని బాధపడేది. అలాగే ఉండేవి ప్రతీ పత్రికలూ. ఏవిధంగా తాను మనస్సులో తలపోసినా—తిరిగి కొత్తపత్రికలు పుచ్చుకొనటం, చదవటం తప్పనిసరిగా జరుగుతూండేది.

ప్రతీ పత్రికమీద ముఖ్యంగా యేఒక్క ఆడదానితో మూడురంగుల ముఖచిత్రం అలరారుతూండేది. అవయవసౌష్టవాన్ని ప్రదర్శిస్తూ, మానాభిమానాలు వదలి తీయించుకొని, ప్రచురించే ఆబొమ్మలయెడల ఆమెకు విశేష ప్రేమాభిమానాలు కల్గలేదు. ధర్మారాయుడు ఒక్క మారన్న '—ఆడవాళ్ళ నుపయోగించుకొనటం-గూడా వర్తకంలో ఒకకిటుకు'—అనే వాక్యాన్ని గూడా గుర్తుంచుకొంది:

పత్రికల అమ్మకంకోసం—కేవలం ఆడవాళ్ళనే ఉపయోగించుకొనటమేం? మీ మగవాళ్ళను యెందు కుపయోగించుకొనగూడదూ?'—లలిత ధర్మారాయుడ్ని ఒకమారు ప్రశ్న వేసింది గూడా.

'నిజం. ఉపయోగించుకొనచ్చు. అయితే ఆడదాని బొమ్మ ఆకర్షించినవిధంగా—త్రివర్ణంగాదు, మరి పది వర్ణాలు వేసి ప్రచురించినా మగవాడి చిత్రం ఆకర్షించదు'—అంటూ నవ్వాడు ధర్మారాయుడు!

ఈ పత్రికల వాళ్లకు బుద్ధిలేదు....; అని యేమేమో అనబోయింది లలిత!

'ఆడవాళ్లలో ఉండే అందం మగవాళ్లలో ఉండదేమో!' అన్నాడు ధర్మారాయుడు!

'ఎవరికుండే అందచందాలు వారి కుంటాయి, వ్యాపారరీత్యా—కేవలం—ఆడవాళ్లను వివిధ భంగిమల్లో ఉపయోగించుకొనటం కేవలం అన్యాయం' — 'అది నీ ఉద్దేశంలోనూ, నా ఉద్దేశంలోనూ అన్యాయం—అది వ్యక్తిగతంగా తీసుకొంటే వాళ్లకు పరమ న్యాయం'.

'ఏం'—అదోవిధంగా మొఖం పెట్టి చూసింది లలిత. 'దీన్నే ప్రకటన అంటారు పత్రికల్లో బొమ్మలు వేసుకోటం, తమ వ్యాపారం అభివృద్ధి చేసుకొనటం కోసం'—

'అంటే'—

'అంటే—ఆబొమ్మలు వేయించుకోటం, అవతలవాళ్లకుగూడా చాలా యిష్టమన్న మాట! తెలిసిందా!' లలిత అమాయకంగా ధర్మారాయుడివైపు చూసింది: 'వాళ్ల కంగీకారమయితేనే చిత్రాలు యీలా వివిధ రూపాల్లో వెలువడతాయి. పత్రికలు మార్కెట్టు కెక్కుతాయి 'ఏజాతీయ నాయకుడి చిత్రమైనా తీసినట్లయితే దాని ముఖం చూసే వాడెవరూ ఉండరు—అందువల్ల......'—మిగిలింది పూర్తిచెయ్యకుండా ధర్మారాయుడు నవ్వాడు!

లలిత గొంతుకలో—పచ్చి వెలక్కాయ ముక్క పడ్డట్లయింది. ఏం జవాబు చెప్పలేదు కాని, తీక్ష్ణంగా అతనివైపుమాత్రం చూసింది.

* * *

ఆరోజు ఆదివారం. ధర్మారాయుడు యింట్లో కూర్చుని యేదోపత్రిక చదువుతున్నాడు...మధ్యాహ్నంవేళ...లలిత కుంపటి రాజేసింది. యేదోపిండివంటచేదామని.



‘కాగితాలు కొంటాం...’—అంటూ యింతలో బయట కేక వినిపించింది.

ధర్మారాయుడు వినిపించుకొనీ వినిపించుకోనట్టుగా నటించాడు!

‘ఏమండీ—ఈపత్రికలన్నీ యింకెందుకూ యిచ్చేదామా?’—అంది లలిత.

‘సరే కానియ్యి’—అన్నాడు ధర్మారాయుడు!

లలిత కుఱ్ఱవాడ్ని కేక వేసింది. వాడు వచ్చాడు! రకరకాల పాత పత్రికలన్నీ తెచ్చి—వాడిముందు—వేసింది లలిత.

తానెందుకు వచ్చిందీ మరచి, వింతగా—పత్రికలమీద ఉన్న బొమ్మల మీద మోజు చూపిస్తున్నాడు కుఱ్ఱవాడు. ధర్మారాయుడు కుఱ్ఱవాణ్ణి చూస్తున్నాడు. లలిత వారిద్దరినీ పరీక్షించుతోంది. కుఱ్ఱవాడు చేస్తున్న పని ఆమెకు కోపం కల్గించింది.

‘ఏం అబ్బాయి యిక్కడ కెందుకొచ్చావ్?’—మంచిఘాటుగా ప్రశ్నించింది లలిత!

కుఱ్ఱవాడు తేరుకొన్నాడు: ‘ఇంతమంచి మంచి బొమ్మలు తీసుకోకుండా యిస్తున్నారేమమ్మా?’ అన్నాడా కుఱ్ఱాడు.

ఒక్కమారు కుఱ్ఱవాడ్ని మింగేదాన్నంత కోపం వచ్చింది

‘ఎందుకీ వెధవబొమ్మలు’—అని కసిరింది లలిత! ‘ఎందుకేమిటమ్మా! సాధారణంగా పుస్తకాలుకొనే వాళ్లంతా బొమ్మల కోసమే కొంటారు’—ఇదా కుఱ్ఱవాడి జవాబు!

‘మాకేం అక్కర్లేదుపో’—

‘మంచిదండి చట్రం కట్టించి, బొమ్మను అమ్మినట్లయితే మూడురూపాయలు గమ్మున ఊడిపడతాయ్’-అన్నాడా కుఱ్ఱాడు!

ధర్మారాయుడికి యోచన పుట్టింది. లలిత యెంతత్వరితంగా—కుఱ్ఱవాడు వెళ్లిపోతే అంత మంచిదని కాబోలు...వాటిని కాటాలోకి వేస్తోంది.

ధర్మారాయుడు లేచాడు; ‘ఆగు’—అంటూ, దగ్గరకువెళ్లి.. నెమ్మదిగా—మంచిమంచి బొమ్మన్నీ చింపటం ప్రారంభించాడు! కుఱ్ఱవాడు తన అదృష్టం తొలగిపోయినందుకు కాబోలు తెల్లబోయాడు!

లలిత ధర్మారాయుడు వైపుచూసింది. ఎందుకు కన్నట్టుగా?

‘ఆల్బమ్ చేదామ్, బాగుంటుంది’—

లలితకు ఆల్బమ్ అంటే తెలియదు.

‘ఏమిటి’—అని ప్రశ్నించింది.

‘బొమ్మలపుస్తకం చూద్దువుగాని!’—అన్నాడు ధర్మారాయుడు-బొమ్మలు చింపుతూ!

తనభర్త, తన యెదురుగానే-సినీమా బొమ్మలు చింపుతూ ‘ఈ బొమ్మబాగుంది కాదూ? ఆబొమ్మ బాగుంది కాదూ? దీని కటవస్ యెక్కువయ్యేయ్. అయినా ఫరవాలేదు’—అంటూంటే వళ్లుమండిపోయింది ఆమెకు!

మొత్తంమీద కుఱ్ఱవాడ్ని పంపటం జరిగింది. నూటయేభై వివిధరంగుల సినీమా బొమ్మలు మిగిలాయి ధర్మారాయుడికి!

‘ఈబొమ్మ లెందుకండీ?’—వస్తున్న కోపాన్ని దాచుకొంటూ అంది లలిత!

‘ఎందుకేమిటి ఆల్బమ్‌కని యిదివరకు నీకు చెప్పలేదూ’—అన్నాడు ధర్మారాయుడు!

‘ఆల్బమ్ వద్దు మరేంవద్దు. ఈలా యివ్వండి. నిప్పులో పారేస్తాను!—అంది లలిత’ క్రిందనున్న బొమ్మలు తీస్తూ.

ధర్మారాయుడికి కోపం వచ్చింది!

‘వద్దు—ఆ బొమ్మలాలా ఉంచు’ అన్నాడతను! లలిత ఊరుకొంటేగా!

కొంటెతనంగా—ఒక దక్కని త్రివర్ణ చిత్రాన్ని తీసుకొనిపోయి నిప్పులోపడేసి వచ్చింది... కాగితం మండుతూంటే—నవ్వుతూ అంది! ‘చూశారా.. మూడురంగుల బొమ్మ యేమయిందో. లేకపోతే యెందుకంత ఆబొమ్మలకోసం తాపత్రయం—అవిగూడా యీలా యివ్వండి. నిప్పంటించుకోవటానికి ఉపయోగిస్తాయ్’—

ఆడవాళ్లకు రావలసిన ఉడుకుమోతుతనం ధర్మారాయుడికి వచ్చింది. లలిత తిరిగి మరికొన్ని బొమ్మలు తీయబోయింది.

‘తియ్యి’—మరీమారు యేం చేస్తావో అని గర్జించాడతను!

లలిత తెల్లబోయింది తాను బొమ్మ తీసినందుకుగాను భర్తరోషం చూపిస్తాడని ఆమె అనుకోలేదు.

‘ఎందుకండీ ... ఆ పాడుబొమ్మలు?’ పాపం అమాయకంగా, ప్రశ్నించిందిలలిత.

‘నాయిష్టం—దాచుకొంటాను. మింగుతాను—నీకెందుకూ?’—అన్నాడు ధర్మారాయుడు!

లలిత మరి మాట్లాడలేక పోయింది. అయితే భర్త ప్రతీచిత్రాన్నీ కుర్చీలో కూర్చుని దీక్షతో పరిశీలించుతూంటే సహించలేకపోయింది. ఏకపత్నీవ్రతం సాగుతున్న యీరోజుల్లో యేభార్య ఊరుకొంటుంది మీరేచెప్పండి!

ధర్మారాయుడు అంతటితో ఊరుకోలేదు. లలిత—మూడురంగుల ముఖచిత్రాన్ని నిప్పులలోపడ వేయటంతోటే—భార్యను యేడిపించాలనే కోర్కె అతనికి పూర్తిగా కల్గింది.

ఆ సాయంకాలమే లావుపాటి నోటు పుస్తకం ఒకటి కొనుక్కొని వచ్చాడు... రాత్రి భోజనం అయినతర్వాత పెట్రోమాక్సు వెలిగించాడు...‘జాబ్’ జిగురు సీసాదగ్గర పెట్టుకొన్నాడు ...షేవింగు బాక్సులోంచి, పదునైన, బ్లేడు కత్తెరా తీశాడు: తీరుబడిగా కూర్చుని బొమ్మలను కత్తిరించి అంటించటం ప్రారంభంచేశాడు.

లలిత భోజనం పూర్తిచేసింది... అంతవరకూ భార్యా భర్తల యిరువురి మధ్యా మాటల్లేవు. అయితే—ధర్మారాయుడు చేస్తున్న పనినిమాత్రం వంటయింట్లోంచే పరీక్ష చేయసాగింది.

భోజనం పూర్తిఅవటంతోటే లలిత ప్రక్కకువచ్చి కూర్చుంది. ఆమె రాకతో ధర్మారాయుడికి మరింతఉషారు కలిగింది: అంతవరకు అతడు చేసినపని, ప్రతీచిత్రానికీ—నాలుగుమూలలూ బ్లేడుతో చక్కగా గీసి, జిగురురాసి, పుస్తకంలో మధ్య అంటించటం!

లలిత రాకతో పద్ధతి ముందుకు అడుగు వేసింది. ఒక బొమ్మవంక తీక్షణంగా చూడటం, వివిధకోణాల్లో ఆ బొమ్మను పెట్టి పరిశీలించటం—చిత్రంయొక్క పూర్తిభాగాన్ని, అతి నిపుణతతో కత్తిరించటం. అంటించేముందు—పెదవులకు దగ్గరకు తీసుకొని ఒకముద్దు వదలటం, జాగ్రత్తగా అంటించటం, ఆ బొమ్మచుట్టూ.. నల్లటి కలంతో చక్కని గీతలు గీయటం!

లలితకు దుఃఖం ఉబుకుకువచ్చింది... ఏ స్త్రీకిమాత్రం రాదు?

ఏకపత్నీవ్రతుడైయుండిన, ధర్మారాయుడయినా, మంచిబొమ్మలు యోచనచేసి తనభార్యకు బాధకల్గించకూడదని ఊహించి మానేస్తే బాగుండేది. అయితే ధర్మారాయుడు ఊరుకోనేవాడా? కేవలం భార్యను యేడ్పించటానికేగా యీపని చేస్త!

అనేకరకాల ఆకృతుల్లో, అనేకవిధాలుగా, అనేకరంగురంగు చిత్రాలు- అందంగా అంటించుతున్నాడు ధర్మారాయుడు. ఉబికిఉబికి వస్తున్న దుఃఖం—దిగమ్రింగుతూ—తానుచేసిన తప్పిదాన్ని గురించి యోచిస్తోంది పాపం లలిత!

ఆమెకు ధర్మారాయుడిమీదపూర్తికోపం కల్గుతోంది. అయితే అతడు బ్రతిమాలిన కొద్దీరెచ్చి పోతాడు!

'ఏమండీ—ఏమిటీ యీపాపిష్టిపని-ఎవరయినాచూస్తే నవ్వుతారు. పదిమందిలో తిరగవలసిన మనం యిలాంటి పనులుచేయవచ్చా? మీరే చెప్పండి'—అంది లలిత నిట్టూరుస్తూ.

'నేనేం దొంగతనంచేశానా? మరే మయినా చేశానా? బొమ్మలు కత్తిరించుకొని పుస్తకంలో అంటించుకోవటంగూడా తప్పే?' అన్నాడు కుఱ్ఱవాడివిధంగా ధర్మారాయుడు.

'మీవాండ్లుగాని, మావాళ్ళుగాని యీ పుస్తకాన్ని చూస్తే యేమనుకొంటారు?'

'ఏం? అనుకొంటే అనుకొంటారు. ఒకళ్లు అనుకొంటారని నేనేం భయపడను-నాకుతోచిన విధంగానే చేస్తూ ఉంటానంతే'—ఇది ధర్మారాయుడి ప్రత్యుత్తరం!

'సరే'—'లెండి' అంది లలిత—కళ్ళ నీళ్లు తుడ్చుకొంటూ!

'అంతేతే! ఆడాళ్లకు తలుచుకుంటే చాలు కళ్ళనీళ్ళు నిలుస్తాయ్'—అన్నాడు ధర్మారాయుడు నవ్వుతూ.

మర్నాడు ప్రొద్దుట ఇంకో తమాషా పనులు చేశాడతను... ప్రతీ బొమ్మచుట్టూ రకరకముల సిరాల్తో నగిషీలు చెక్కటం, ప్రతీచిత్రంక్రిందా పేరువ్రాయటం సాగించాడు.

ఆసాయంకాలం ఆఫీసునుండి కొందరు స్నేహితుల్ని గూడా రప్పించాడు. తన కృషివారికి చూపించాడు!

'చాలా బాగా తయారుచేశావోయ్' 'ఆల్బమ్ అన్న పొగడ్తపొందాడు.

వాళ్ళుఅన్నమాటకు ధర్మారాయుడు ఆనందంపొందాడు. లలితమాత్రం చాలా లోతుగా విచారించింది... చాలాదూరపు ఆలోచనగూడా చేసింది.

స్నేహితులతో తిరిగి బయటకువెళ్ళుతూ, రంగుసీరాలు ఉంచిన అల్మారాయరుమీద, బొమ్మల పుస్తకాన్ని గూడా పడేశాడు ధర్మారాయుడు. అతడు వెళ్లినప్పటి నుంచీ లలిత ఆలోచిస్తూనే ఉంది.

కొత్త పత్రికలను చేతపట్టుకొని, కుఱ్ఱవాడొచ్చాడు. 'నాయనా నీపత్రికల కొకదణ్ణం! అవసరంలేదు. ఆయన అడిగినా, యేంఅవసరంలేదన్నానని చెప్పు'—అని పంపించింది కుఱ్ఱవాడ్ని!

ఆమె ఆలోచనగూడా ఫలించింది...

రాత్రి ధర్మారాయుడు యింటికితిరిగి వచ్చేసరికి ఆఆల్బమ్—అతని అత్యంత ప్రియతమైన బొమ్మల పుస్తకం—పూర్వపుటాకృతిలో లేదు! ప్రతీచిత్రం మీద-కొంతోకొంతో సిరా చిలికి అసహ్యంగా పోయింది. అందంగాఉండే-ఆబొమ్మల పుస్తకం అందవికారంగా, రాక్షసరూపంతో తయారయింది.

ధర్మారాయుడికిఒక్కపట్టున లలితను మింగేయాలన్నంతకోపం వచ్చింది!

'ఏమిటిది?' అని గర్జించాడతను!

లలితతొణకకుండా జవాబిచ్చింది! "ఏం చెప్పను. మీరువెళ్లినతర్వాత, యింటివారి పిల్లవాళ్ళపాపాయిని తీసుకొనివచ్చి—అల్మారాయరుమీద కూర్చోపెట్టింది కూర్చోవద్దని చెబుతే బాధపడుతుందని చెప్పలేదు ఆకుఱ్ఱవాడు తిన్నగా కూర్చుండక—ఆ పాపిష్టిసిరాబుడ్డీనిటూనటూ ఆడించి బొమ్మలనిండా సిరాచేశాడు. సిరాబుడ్డిని క్రింద పడేశాడు. చూశారా ముక్కలు! ఏం చెయ్యను ... ఇంటివాళ్ళు ... ఎటునుంచి ఎటువస్తుందో అని ఊరుకుండిపోయ్యాను".

'మంచిపనిచేశావ్. మరియింక యీ రాక్షసిపుస్తకం ఎందుకూ?'— అంటూ బయటకు విసిరాడు ధర్మారాయుడుమంచీ చెడ్డా ఆలోచింపకుండా!

'అమ్మయ్య'—అని గుండెమీద చెయ్యి వేసుకొంది లలిత.

రాత్రి భోజనాలయిన తర్వాత 'లలితా కొత్తపుస్తకాలేమయినా తెచ్చియిచ్చాడా?'—అని ధర్మారాయుడు ప్రశ్నించటంతోటే, లలిత వంటయింట్లోంచే నవ్వుతూ జవాబిచ్చింది! "వచ్చాడు, మరి పుస్తకాలు యివ్వవద్దన్నాను. డబ్బు దండుగ. వాటిని తీసుకొనిపోయాడు..." అంది!

ధర్మారాయుడికేం తెలిసిందో—నవ్వుకొన్నాడు!

# వినాయకుడి సంబరం

ఎక్కడైతే చెట్టుందో ఆ పట్నంలో అక్కడల్లా నీడ, ఎక్కడైతే నీడ వుందో ఆ పట్నంలో అక్కడల్లా నిలువ నీడలేని, బిచ్చగాండ్లు; బిచ్చకత్తెలు. లక్షాధికారులైనా తమ తమ సిమెంటు భవనాలు ఏ భూకంపానికో, ఏ తుపాను విసురుకో పడిపోతాయి అనే భయం కలవాళ్లై యుండవచ్చుగాని, ఆ బిచ్చగాండ్లకు బిచ్చకత్తెలకు ఎప్పుడూ ఏ భయమూ లేదు. చెట్లను పాతిన వాళ్లు కారు వారు. చెట్లకు నీళ్లుపోసి పెంచిన వాళ్లూ కారు. ఆ చెట్లకూ ఆ బిచ్చగాండ్లకూ బిచ్చకత్తెలకూ అవినాభావ సంబంధం ఎలా ఏర్పడిందో? అడక్కుండా పువ్వులు పడేస్తాయి. అపేక్షించకుండా మలయమారుతాన్ని వీస్తాయి కాని ఆ బిచ్చగాండ్లకూ బిచ్చకత్తెలకూ ఎంతమాత్రం ఆకలి తీర్చే చెట్లు కావవి. అవి అన్నీ దిరిసెన చెట్లు. పువ్వు లతిమెత్తన, నీడ లతిదట్టము! కాని కాపు కడుపు నిండించేటంత మాత్రమున్నూ కాదు. ఆ కారణంగా అక్కడ కూర్చుని సమావేశమయ్యే బిచ్చగాండ్లు బిచ్చకత్తెలు తమ పొయ్యి మంటలకుగాను ఆ చెట్ల యొక్క ఎండు పుల్లల్ని కట్టెపుల్లలుగా ఉపయోగించుకుంటూ, అవసరం వెంబట్టి బెరడు ఇత్యాదుల్ని ఊడబెరికికొంటూ చెట్లకుపకారం చేసే బదులు అపకారమే చేస్తూ వుంటారు. అయితే ఏ చెట్టూ చిగురుపట్టి అంతో ఇంతో ఎదుగు చూపించేవి గాని, ఆ చెట్లు ఈడు రోగోడా మని తమల్ని ఆశ్రయించుకున్న బిచ్చగాండ్లలా బిచ్చకత్తెలా కనిపించవు. అవి అందానికి ఆనందానికి అనువైన చెట్లు. ఊరి మధ్యన ఉన్నాయి అంటే నాగరికులకు చాలా చనువైన చెట్లు అని వేఱే చెప్పక్కఱ లేదు.

మర్నాడు వినాయక చవితి పండుగ అనగా, ఈ రోజున ఒక ఏదాది ఏం జరిగిందీ అంటే, ఒక బిచ్చగాడు కాళ్లు కళ్లు లేనివాడు ఆలా ఆ చెట్లలో ఒక చెట్టున సాయంకాలమునకు వేర్లాబడిపోయాడు కళ్లు లోతుగా పోయాయో అసలున్నాయో లేదో కనిపెట్టడానికి ఆస్కారం లేని పెద్ద మొగం వాడిది. కాళ్లు కొంకర్లు పోయి, అప్పటికప్పుడే, పైబడ్డ ఆ చెట్టు వ్రేళ్లలా మెలికలు తిరిగిపోతున్నాయి. ఆవేళప్పుడు ఒరిగే సూర్యుని ఒఱపైన ఎఱుపు కాంతి తన ఎదుటొమ్ముల మీద ఎఱ్ఱని పటాచట పయటమీద పడి, యినుమడింపగా, రంగు శృంగం కాపరుచుకుంటూ వయ్యారంగా నడిచే ఒకానొక ఎలనాగ భిక్షుకురాలే ఆమెను, మట్టెలచప్పుడు చేసుకుంటూ ఆ కబోదును దరిసింది. "ఓలమ్మో! ఒశేవు! బుల్లీ!" అని కేకేశాడు కబోదు. "ఓరి నిప్పెంకా ఇక్కణ్ణే వున్నావంట్రా? అందఱూ మనవోళ్లు ఆరి ఆరి స్థానాలు ఆక్రమించుకుని వినాయకుడి గుడివీధిని కూకుండుండి పోయారు, అప్పుడే ఈ పొద్దే! రేపు వినాయకుడి చవితంట! ఓరి! నిప్పెంకా ఇక్కణ్ణే వున్నావంట్రా?" అంటూ ఆ గుడ్డి కుంటివాణ్ణి ఆ కామిరి కులుక్కుంటూ చేరి కుశలప్రశ్న వేసింది. "అమ్మో! ఆదాకా సెగిసి వెళ్లే ఓపిక గాని ప్రాపకం గాని నాకు లేదు. బుల్లీ! రేపు వినాయకుడి చవితి అయితే మనకు వొరిగేది ఏమిటి? మన ముఖాన్ని ఎవళ్ళు పడేసినా రాగిడబ్బే, తప్పితే రవ్వింత బియ్యం! సక్టుజేసి ఉండ్రాళ్లూ ఇళ్లల్లో నే వండుకు తినేరు భాగ్యవంతులంతాను. నీదాకాను నాదాకాను రావు!—"బియ్యముంటే నే వొండి పెడతా మాంవా!"—"ఏమిటె అన్నమా?"— "కాదు ఉండ్రాళ్లు మాంవా!— "రేపా మాపా?"— "రేపు! ఈమాపు లెవళ్లూ ఉండ్రాళ్లు వండుకోరు. తెల్లారిగాని వినాయకుడి సంబరం లేదు."— "వినాయకుడి పొట్ట పెద్ద పొట్ట బుల్లీ! సిన్నప్పుడెప్పుడో కళ్లున్నప్పుడు సూచిన గాపకం!" — "అంత పొట్టా ఎప్పుడూ ఎత్తుగా సెగిసి వుంటుందే గాని ఒకప్పుడూ లోతుకుపోదు. అదీ ఆ దేవుని సిత్రం!"— "ఆకలి లేని దేవుడులా వున్నాడు. ఆణ్ణి అయి అయినా పుట్టాను గాదు నేను?"— "ఓరి! కోరక కోరక వినాయకుడి రూపమే కోరావు?"— ఆ దేవుడి ముక్కు పెద్దదే! బారెడు పొడుగుంటేని ఆరోజుల్లోనా బారతో కొలిస్తే!— "ఇప్పటికే అంత పొడుగే వుంది అదీ?" మతి విడ్డూరం! అంత ముక్కున్నా నాటికీ నేటికీ జిగ్రున చీది ఎఱుగడు!"— "అసలు ఏనుగుతుండము ఏనుగు మొండెము పెట్టి పుట్టిన అవతారమూర్తి! ఆ పొట్టలో కూకుంటే మళ్లీ మనకు ఆకలే వుండదు బుల్లీ! ఆడి ముక్కుట్టుకు మనం గాలి పీలిస్తే ఎన్నెళ్లకూ చావం బుల్లీ!"— "ఒరేవు! నీతో కబుర్లు సెబుతూ ఇక్కడ కూకుంటే అక్కడ నా కెవ్వడో కొక్కొట్టి పూగుకుంటాడు. సందలవుతోంది. ఏమిటె నీ వ్యాపారం సెప్పు! ఇక్కడిల్లా సస్తానంటావా? ఆలా ఆ వినాయకుడి గుడివీధికి వస్తానంటావా?"— "రాను బుల్లీ! రాలేను బుల్లీ! ఇదిగో! ఈ సోలడు బియ్యం పట్టుకెళ్లి నాకు ఈరేత్రి కంత గంజి కాసి పట్టుకొచ్చి పొయ్యి. ఈలా ఈ సెట్టుమొదట అంటిపెట్టుకు నిదరోతా! ఇనాయకుడు నాదగ్గఱకు రావాలిగాని నేను ఇనాయకుడి దగ్గఱకు పోలేను."— "నీదగ్గఱకు రావడమంటే నీవు మహా తపస్వాలివి అవితే వస్తాను. లేకుంటే మహాదాతవైతే వస్తాడు. రెండూ కాని కబోదుబిచ్చగాడివైనప్పుడు నిన్ను చేరేవాడెవడ్రా? కాళ్ళు సరిగ్గా సాచుకో పూ తొంగో లేవుగాని ఇనాయకుడు నీదగ్గఱకు వస్తాడు? ఈ మాపటికి గంజి నేనే కాచుకోవడం లేదు. నీకూడా ఎక్కడ కాచగలను? నీబియ్యం నీ గోసినే వుంచుకో! సెట్లమధ్య సీకటికీ నీ కంటి సూపుకీ తేడా కనిపెట్టేవాడు ముక్కోటి దేవతల్లోనూ లేరు. ముప్పైకోటి ప్రజల్లోనూ లేరు. వెళ్లొస్తా! నీవు వస్తానంటేమో నీ సాటున నేనూ అడుక్కోవచ్చు ఆ దేవాలయపు వీధిని అని అనుకున్నాను! నీ కీపూట గంజి కాసిపోసి, నిన్నెత్తుకెళ్లినా వచ్చేట్టు లేవు. పెద్దసతుకులు కొత్తగా నేర్చేవు. ఇనాయకుడే నీదగ్గఱకు రేపు రావాలంటున్నావు! పంపిస్తా! కాసుకుండు!" అని ఎటకారంగా హేళనగా వక్కాణించి తిప్పుకుంటూ చక్కాపోయింది ఆ తిరిపికత్తె! ఆ మెరుము క్క

శ్రీ కవికొండల వెంకటరావు

మాటనే వినగలాడు గాని ఆమె తన వెనకా ముందూ కాపరించిన వయసూ వొయ్యారం ఆ కబోదు కానలేదు. "వినాయకుడు ఈ పాళంగా నాకు ప్రత్యక్షమై రెండు కళ్ళూ రెండు కాళ్ళూ ప్రసాదిస్తే లంజా! నిన్నల్లా పోనిస్తానే ఈ సీకటిరేత్రి!" అని లేని వోపిక తెచ్చుకుని, గొంతుక హెచ్చించి, ఒక్క కేకేసి, లోని అక్కర వొక్కటీ తీరకుండానే ఆ భాద్రపద శుద్ధ తదియనాటి రాత్రి కొత్త వెన్నెల మసకమసకలో మానుమొదట జేరబడి చిత్తవిూశ్వరుడికి ఒప్పజెప్పి నిద్రపోయాడు ఆ కబోదు గాడిదకొడుకు.—దాన్ని "లంజా" అని తిట్టినవాడు "గాడిదకొడు" కెందుకు గాడు?—"ఆరాత్రి వొక్కటే రాత్రి ఆ చెట్లక్రింద మఠీ భిక్షుకులు నివసించని రేత్రి! మఠీ నరసంచార మెఱుగని రేత్రి! మఠీ సురాసురలు విహరించని రాత్రి!

వెళ్ళిపోయిన తిరిప కత్తెకు మాత్రం నిద్ర పట్టి ఏడిసిందా? వీధి వీధి మధుకర వృత్తిని తిరిగి అప్పటికప్పడే "కలువ పువ్వులు" "పత్రి" "మామిడాకులు" అంటూ కేకలు వేసి అమ్మేవాళ్ల కేకల ఉలిక్కిపడి తప్పుకుంటూ—తళుకు బెళుకు దిమ్మల్లో కొట్టి తీసిన మట్టి వినాయకుల్ని అసంఖ్యాకాల్ని కనుగొంటూ, ఎట్టకేలకు తనతావు చేరుకుంది. "అమ్మా! బిచ్చం! తండ్రీ బియ్యం! అప్పా! కాని! మామ్మగారూ! అంటి పండు!" అని అరవసాగింది ఆ వినాయకుడి గుడి వీధిని. వయసూ వొయ్యారం కొయ్యబొమ్మకైనా చూపించవచ్చును గాని ఒకటో రకం గొంతుక ఎలా రాగలదు? అది ఆమెకే వుంది! అయినప్పటికీ అతి నిరుపేదరాలు కావడం చేతను, అనభిజ్ఞ కావడంచేతను ఈ మహా ప్రపంచంలో ఒక అమావాస్య చీకటి రేకగా మఱుగుపడిందే కాని మెఱుపు తీగలా మెఱసింది కాదు ఆమె! అదిగో కబోదు చూపులో—లోచూపు అందాం!—ఆ తిరిపకత్తె, కడాని జిగిలా, రతీజాని ముల్లికిలా, ఆమని రతనపు గుళికలా, కోటి పారిజాతాల పరిమళింపులా విరిసిపోయింది తెల్లవారూను. "అది ఎత్తుకు తీసుకుపోయి ఆ దేవుడి గుడి వీధిని కూకుడుండబెడతానంటే పోలేకపోయాను" అని ఒక పాలి ఏడుపు, వినాయకుడి గొప్ప బొజ్జ కొలవ శక్యంగాని మహోతుండం తలుచుకు ఒకపాలి నవ్వు ఆత్మలో ప్రదర్శించుకుంటూ ఆ కబోదు కలకాకుండా, కలతకాకుండా కడజాము కూడా ఆ రాత్రి గడిపాడు.

తెల్లారితే వినాయకుడి చవితి. వినాయకుడి పూజ! అర్చన! ఆరగింపు! హారతి!—ఓ! ఈ లోకంలో అసంతృప్తి మఠీ వుండడానికి వీల్లేదు. ఆకలి మఠీ వుండడానికి వీల్లేదు!

ఆ పట్నంలో ఒక సర్కసుకంపెనీకి చెందిన ఏనుగుల్లో, ఒక ఏనుగు, దానికి యజమాని సరిగా తిండి పెట్టకో, దానిని తిన్నగా చూడకో—ఏదో కారణంగా ఆ తెల తెలవారే సమయమప్పటికి విడి వడ్డది రోడ్డె వచ్చి వచ్చి ఈ దిరిసెనచెట్ల గుంపుల మధ్య అడవిలో ఆగినట్టు ఆగింది. ఘీంకరించింది. కబోదు, ఆఘీంకారం వినబడినా ఏనిదో అన్నట్టు ఊరుకొన్నాడు. సహజ చాపల్యం కొద్దీ తొండం ఊచింది. దాని గాలి సోకి కొంచెం అట్టిట్టు తప్పుకొన్నట్టు ఇంకా చెట్టుమొదటికే ఎగబాకాడు. కబోదు. ఏనుగు పై కొమ్మల్ని అందుకుని కిందికి విడిచి పడేసింది నాలుగైదింటిని. ఎవడైనా చెట్టెక్కి కొమ్మలు నరుకుతున్నాడా అని కబోదు కాననేరనివాడైనా పైకి తలెత్తాడు కళ్లున్నవానికి మల్లే. వానికేమీ కనబడలేదు.



మఱొక్క నిమిషంలో చెట్టుమొదటినీ ఈ కబోదునూ కలేసి తన తుండాన్ని చుట్టుకొన్నదై ఏనుగు చెట్టు సమాంతంగా పెకలించి కబోదు కనబడనిరీతిగా చెట్టును వానిమీదకు కూల్చి, చెట్టుమీద తాను సర్కసు రంగస్థలంలో ముక్కాలిపీట

(23-వ పేజీ చూడండి)

# అల్లుగాడిపెళ్లి

శుభలేఖతోపాటు మరో ఉత్తరం. రెండూ రామ్మూర్తి మామయ్యదగ్గిర్నుంచే.

"ఏమిటే? నరసింగరావు గాడికి పెళ్లా?" అన్నాను ఆశ్చర్యంగా.

అమ్మకు చెప్పాను. "ఎవరు? అల్లుగాడికా?" అంది అమ్మ.

"ఇంత గుంటడున్నాడో లేదో గాని వీడికి పెళ్లట!" అన్నాను.

"గుంటడేమిట్రా? పదహారేళ్ళున్నాయిగా!"

"పదహారేళ్లకి పెళ్లేమిటమ్మా, మరీను!"

"బాగుందిరా, తగిన సమ్మంధం దొరికితే చేసుకోకేం జేస్తారు?"

"ఎంత తగిన సంబంధమైనా ఇరవయ్యేళ్లయినా నిండకుండా పెళ్లేమిటే? ఛీ!"

నాన్న శుభలేఖ చూసి "రామ్మూర్తి అదృష్టవంతుడ్రా!" అన్నారు.

"ఏమిటది నాన్నా అదృష్టం! హాస్యాస్పదంగా వుంది. పిల్లకి ఏ తొమ్మిదో పదో ఏళ్ళుంటాయిగా బోలు! ఛీ—" అన్నాను.

"అయితే నువ్వింకా రెండేళ్ళు పోతేనేగాని పెళ్లాడవుట్రా?" అంది అమ్మ.

"ఛస్తే పెళ్ళాడను."

"చావడం దేనికి, ప్రతీదానికీను!"

"అబ్బ! ఇంతల్లో చచ్చిపోక్లేదే,"

"రెండేళ్ళు దాటితే గాని పెళ్లాడక పోవడం అటుంచగా ఈ పెళ్లికి రాను" అన్నాను.

"ఏం?" అన్నారు నాన్న అధికారంగా.

"ఆ పెళ్లి నా యిష్టానికి వ్యతిరేకంగా జరుగుతోంది. నాకు అది జరగడమే యిష్టం లేనప్పుడు నేను చూస్తూండగా జరగడం అంతకంటే యిష్టం ఉండదు. అంచేత నేను రాను. కావాలంటే మీరిద్దరూ, బాబ్జీ రమా వెళ్లండి అంతే."

"రానంటే ఏలా, కుదుర్తుందిరా? స్వయాన మేనత్తకొడుకు పెళ్లిగదా! ఒక్క సంవత్సరం మన కమలం పెద్దదె అయిపోయిందిగాని లేకపోతే దాన్నే యిద్దుం కదుట్రా?" అంది అమ్మ దిగులుగా.

వీడికీ, ఆ రామగోపాలం పరిచయం చిన్న దగ్గిర్నుంచీ కొంచెం పెద్ద కబుర్లూ నిక్కచ్చి కవిత్వమూ ఆరంభమయ్యాయి. ఉండనీ, నేనూ చూస్తాను అదేమిటో! శక్తిమూడురోజులా వొండుకుతింటాడు!" అన్నారు నాన్న.

"అనాసరంగా రామగోపాల్ని అనకండి. అతని వల్లేం రాలేదు. అంతా నా అభిప్రాయమే. నేనే రానంటున్నాను." అన్నాను.

"రాకపోతే ఎలాగరా? ఎలాగా గోపాలం రాముడూ పైదేశాల్లో వుండిపోయినారు గనకరారు. నీకేంరా, దొబ్బుడాయి,—ఆఁ? రాకపోతే ఏడీ మీ రాధాకృష్ణా అని అడుగుతారు. ఏం చెప్పమన్నావ్?" అన్నది అమ్మ నిలదీసి.

"అదే అనే. రాలేదని చెప్పండి. ఇందుకు రాలేదని కూడా చెప్పండి." అన్నాను.

"అలాగే లేరా, మరి ఊరుకో." అన్నారు నాన్న.

"అదేమిటండీ మీరూ అలాగే అంటారు?—ఒరే నాన్నా రాకపోతే కాగుండదురా వాళ్లేమైనా అనుకుంటారు! నలుగురుండగా ఒక్క గుంటణ్ణి తీసికెళ్లమా?"

ఉన్నాడుగా, బాబ్జీ, వాణ్ణి కనుకి తీసికెళ్లండీ!" అన్నాను.

పెళ్లి ఇంకా మూడురోజులుందనగా శుభలేఖతోపాటు వొచ్చిన ఈ ఉత్తరం చూస్తున్నాను. మరీ మరీ చెప్తున్నాను; అందరూ

## శ్రీ అనుముల వెంకటశేషకవి

"పెంపిరాలి కోడలు ఇంటికొస్తోంది, అదృష్టమే." అంది అమ్మ.

"ఏమో. నేనుమాత్రం ఆ పెళ్లికి వెళ్ళదల్చుకోలేదు. ఛీ. ఇరవయ్యేళ్లయినా రాకుండా పెళ్లామూ పిల్లలూను!" అన్నాను ద్వేషంగా.

"ఏమిట్రా నువ్వనేదీ?" అన్నారు నాన్న.

"ఏమీలేదు. ఇలాంటి కుసంస్కారులు ఇంకా ఉన్నారంటే ఏడుపొస్తోంది మనిషికి పూర్తిగా జ్ఞానమూ వ్యక్తిత్వమూ వొస్తేగాని పెళ్లి చెయ్యకూడదు! జీవించడానికీ పెళ్లాన్ని పోషించడానికీ తగిన ఉపాధేనా సంపాదించాలా?"

"సంపాదిస్తాడు; తొందరేమిటి?"

"ఏమో, నేనుమాత్రం ఈ పెళ్లికి రాదల్చుకోలేదు. నా సూత్రాల్ని వయలేట్ చేసి జరుగుతున్న పెళ్లి గనక!"

"ఏమో. అలా జరిగి వుంటేదీ అనే విషయంగురించి మాట్లాడ్డం తెలివితక్కువ. నే చెప్పుడూ "ఇలా జరుగుతూంది" అనే మాట్లాడతాను. వాడు నా మేనత్త కొడుకైతే! బ్రహ్మదేవుడి పెద్దకొడుకైతే! నా కిష్టంలేని ప్రిన్సిపుల్ మీద జరుగుతున్న పెళ్లిగాబట్టి నేను నా చేతనైనంతవరకూ దాన్ని ఎవాయిడ్ చేస్తాను. నా చేతులో ఉన్నది బోయ్‌కాట్."

"అయితే నిజంగా రావుట్రా?" అంది అమ్మ.

"ఆహా! నిజంగా రాను! నేను రాకపోయినంత మాత్రంలో ఆ పెళ్లి జరక్కపోదు. వాళ్ళందరూ "మనకి కావలిసిన వాళ్ళూ మనవాళ్ళూ కాబట్టి మీరందరూ వెళ్లండి."

"సరే అయితే ఉండిపోరా. నువ్వు రాకపోతే ఆ పెళ్లి జరక్కపోదు.—

రావాలి. రాముడికీ గోపాలానికీ శుభలేఖలు వేశాను; రావడం మరిచిపోవద్దు. అంటూ తిరిగి తిరిగి అదే రాశాడు మా రామ్మూర్తి మామయ్య.

ఇంతలో వీధిలోంచి చెప్పులు చప్పుడు చేసుకుంటూ సొంతంగా తనే దిగబడ్డాడు. అంతసేపూ అతను ఎదురుగా ఉన్నట్టు నే ననుకోడంవల్ల కాబోలు, కుశల ప్రశ్న అయినా చెయ్యకుండా "ఏమిటి మామయ్యా ఇలా చేశారు? కుర్రాడికింకా పదహారో యేడొచ్చిందో లేదో అప్పుడే పెళ్లా, ఎవరన్నా వింటే నవ్విపోరూ?" అనేశాను గబగబా.

మామయ్య కూడా కొంచెం ఆశ్చర్యంతో సరిపుచ్చి "ఏమోరా, నే నింతవరకూ చాలామందితో చెప్పానుగాని ఎవరూ నవ్వ లేదు. అదృష్టవంతుడివి పోరా, అన్నారు!" అన్నాడు.

"పెద్దలు నిశ్చయించారంటావు; ఈ పెద్దలకి బుద్ధివుందా? వాళ్లకి బుద్ధి లేకపోతే నీ బుద్ధి ఏంగడ్డి తిందీ అని!—పోనీ ఓ ప్రశ్నకి జవాబు చెప్పు చూదాం? మీ అల్లుగాడికి, పెళ్ళంటే అర్థమన్నా తెలుసా?"

"తెలియాలేమిటి? మా చిన్న తనాల్లో ఏడోయేట ఉపనయనం, పధ్నాలుగో ఏట వివాహం చేసుకునేవాళ్ళు ఆ లెక్కని అసలు ఆలస్యమే అయింది!"

"అప్పుడు చేసుకుంటే చేసుకునేవాళ్లేమో, అప్పటి మనుషులు వేరూ ఇప్పటి మనుషులు వేరున్నూ!" అన్నాను.

అమ్మ వచ్చి "ఇదేమిటి, అన్నగారూ! ఎప్పుడు రావడం?—ఒకే క్రిష్టా ఏమిట్రా యిది ఆయ నొస్తే వాదన పెడతావూ, ఇంకా..." అన్నది.

"కుర్రాడు, తెలివితేటలు కొస్త జాస్తీ అయినాయి." అని మామయ్య లోనికి నడిచాడు.

మధ్యాహ్నం అమ్మ "ఆయన్తో చెప్పరా నీ గొడవ!" అంది వేళాకోళంగా నవ్వి.

"ఓ, నమ్మకంగా చెప్తాను.—ఇదుగో, ఓయి మామయ్యా, మీ అల్లుగాడి పెళ్లికి నేను రాదల్చుకోలేదు!"

"ఏమిరోయి?"

"పదహారేళ్లప్పుడు పెళ్లి చెయ్యడం నా కిష్టంలేదు. అది జరగడమే నా కిష్టంలేనప్పుడు, చూడడం అంతకన్నా యిష్టం ఉండదు. అంచేత రాను."

"పోనీ, కళ్ళు మూసుకుందువుగానిలే."

"అప లాస్త్రీగా!"

"ఒపల నిక్కచ్చిగా వుందే, వ్యవహారం!"

నాన్న అన్నారు, "వీడికి, రామగోపాలని, ఓ ఫ్రెండున్నాడు. ఆయన దగ్గిర నేర్చుకున్నవి—నిక్కచ్చితనం కవిత్వం, పెద్ద కబుర్లున్నూ. దాని ప్రతాపం ఇదంతాను!"

"అనవసరంగా రామగోపాలాన్ని అనొద్దు నాన్నా. ఇవన్నీ నా సొంత అభిప్రాయాలు!"

"ఓస్!"

* * * *

రామగోపాలుకు,

మన సిద్ధాంతాల్లో ఒక ముఖ్యమైనదాన్ని వయలేట్ చెయ్యవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను; నేను ఈరోజే బయలుదేరి ఒక పెళ్లికి వెళుతున్నాను. వరుడి వయస్సు పదహారు. నాచేత మావాళ్ళు బలవంతాన ప్రయాణం కట్టించారు. వాళ్ళు ఇంటలేని రోజుల్లో వండుకోవడం కష్టమని కూడా ఒక విషయమే. కాని దీనికి అట్టే ప్రాముఖ్యత లేదు. కాని గుడ్డిలో మెల్ల అన్నట్టు వివాహ వేళకి మంటపంలో ఉండక, సాధ్యమైనంత తక్కువ సంభాషణ నడుపుతూ, ఉండడానికే నిశ్చయించాను. నా యీ ఓటమి నా హృదయానివైన నీతో ముందు చెప్పవలసి చెప్పాను.

నీ రాధాకృష్ణ

ఏమయితే నేం, బయలుదేరాను. తోవలో జట్కాలోగాని రైల్లోగాని మళ్లా జట్కాలోగాని ఏవిధమైన సరససంభాషణాలోనూ పాల్గొనలేదు.

పెళ్లికొడుకుముఖం చూడదల్చుకోలేను. కాని తప్పలేదు. వెళ్ళగానే ఓహో రాధబావా! అన్నాడు. హారిఫూలా అనుకొని నవ్వాను. బలివ్వబోయే మేకపిల్లలాగ వాడు నాలో జాలి కలిగించాడు. వీణ్ణి [illegible]గదా, జీవితానికి బలివ్వబోతున్నారు! పెళ్ళంటూ ఒక సుఖవత్తరమైన సన్నివేశాన్ని ఎరగా చూపిస్తూ విషాదాయత్తమైన ఎనభైనాలుగేళ్ళ జీవితం వాడి చేతుల్లో పెడుతున్నారు!

వాడితో మాట్లాడ్డానికి ఇష్టంలేదు. కాని క్రమంగా అది కరుణకింద మారి సాయంకాలం వేళ వేరేగా ఓచోట కూచోబెట్టి నాలుగు ప్రశ్నలు వేశాను.

నీకు వ్యక్తిత్వం లేదా అన్నాను. వాడికది అర్థం కాలేదు. జీవితాన్ని యీవిధంగా పరాధీనం చేసుకుంటావేంరా అన్నాను. ఏమిటి బావా అన్నాడు. ఓరి బద్ధూ ఇప్పటినించీ నీకు పెళ్లెందుకురా అన్నాను. అమ్మా నాన్నా చేసుకోమన్నారు చేసుకుంటున్నాను; తప్పా అన్నాడు. ఓరి ఉడ వెధవా అని పిల్లెగా అని కట్నమెంతరా అన్నాను. అదేమో అన్నాడు. పిల్ల బావుంటుందా అన్నాను. నే చూడలేదు. ఫోటోలో బాగానే వుందన్నాడు. పెళ్లి మానేయకూడదూ, ఇంత ఇన్ఫర్మేషనైనా

చెప్పలేనివాడివీ ? అన్నాను. వెర్రిగా చూశాడు. వయస్సెంతరా అంటే పదకొండోయేట్ల అన్నాడు. బాగానేవుందిరా భాయ్ అన్నాను.

బలిపశువును పెళ్ళికొడుకనే పేరుతో గంగిరెద్దులా మేకప్ చేశారు. తరలి వెళ్లారు. నేను 'వెధవ'శబ్దం ఉచ్చరించుకుంటూ ఫాలో అయినాను.

* * *

పెళ్లి చూడకూడదని నా ఉద్దేశం.

మర్నాడు తెల్లవారు ఝామున నాలుగున్నరకల్లా ముహూర్తం. తొలినాటి పొద్దుటికే వెళ్లాం. పొద్దుటదిగగానే ఊళ్ళో నాకంటికేదైనా యింపుగా కనపడతాయేమోనని తిరిగాను. ఏం కనిపించలేదు. ఓ కాఫీహోటల్లో మస్తుగా తిని మళ్లా యింటికి చేరాను. విడిదిలో మాకిచ్చిన ఆ గదిలో బసలిక ప్రోత్సహించగా ఆవహించిన నిద్రాదేవిగారి పొందు పొందాను."

ఒంటిగంటప్పుడింత ఉడికీ ఉడకని ముద్ద పడేశారు. తిని పీటిచెక్కుకున్న మా ఆకులూ నమిలాను. నోరు ఎర్రగా అయింది. ఎవర్తోనూ మాట్లాడకండా పడక వేశాను.

నాలుగ్గంటలప్పుడు మెలకువ వచ్చింది. నాకోసం వేరేగా ఫ్లాస్కులో వుంచిన కాఫీనీ, పక్కని అరిటాకు మాత పెట్టి అద్దాకులో వుంచిన కారాబూందీనీ తినేశాను. ముహం కడుక్కుని తలదువ్వుకుని ఊరుమీద పడ్డాను.

సగంలో మంగళ్లాళ్ళు బాజాలు వాయిస్తూనూ, ఆడాళ్లు పట్టుచీరలు కట్టుకొనీ, వెనకమగాళ్లు మామూలు బట్టలే వేసుకున్నా జరీఖండువాలు పైన వేసుకునీ, ఆ వెనకా యీమధ్యా కొత్తబట్టలు కట్టుకున్న కుర్రకారూ కనిపించారు. పిలవడానికి ఛేచ్.



వాళ్లని తప్పించుకుని అలా వెళ్ళాను. ఊరు దాటాను. ఆ శీలుమెట్టు దాటాను. మ్యూనిసిపల్ లిమిట్ దాటాను. పొలాల మీద పడ్డాను.

అన్నట్టు సినిమా వుందిగా ఊళ్ళో !— వెనక్కి తిరిగాను. కాని సినిమానించి వచ్చేసరికి భోజనం పంగ తేమౌతుందో ! అనుకుంటూ ముందుకి సాగిపోయాను.

నా అదృష్టవశాత్తూ అక్కడ ఓ చెరువు పూర్తిగా నిండివుంది. చప్టామీంచి నీళ్ళు పడుతున్నాయ్. అనుక్షణమూ దాంట్లో నూతనత్వం కనపడ్డది. ప్రతీ సెకండూ చూడాలనిపించేటంత మధురమైన మార్పు కనపడ్డాది. అక్కడ, ఈతచెట్టు కింద అలా ఏడువేల రెండువందల సెకెండ్లకి పైగా ఎన్నో మార్పులు చూసినట్టు నా రిస్టువాచ్ చెప్పింది. తిరుగుదారి తెలుసుకోడానికి నానా అవస్థలూ పడి రోడ్డుపట్టేసరికి నాయనా, యీ పెళ్లికో రామ్ రామ్ అనిపించింది.

"పెద్దల" కి పదివేల నమస్కారాలు చేసుకొని రోడ్డెక్కినవాణ్ణల్లా తిన్నగా వెళ్ళిపోతున్నాను.

"ఎటు బాబూ ఎల్తన్నారు?" అన్న కంఠం మేలుకొలిపింది.

అదేదో ఎక్కడ అని అడుగుతున్నాడెవడో, అనిపించింది. "నాకు తెలీదయ్యా, ఆ మీద కెళ్ళి కనుక్కో. మా దీ వూరు కాదు." అని సాగిపోయాను.

మళ్ళా "ఎందాక బయలెల్లినారు?" అని గట్టిగా ఆ స్వరం అడిగింది.

"చెరువు కెళ్లి వొస్తున్నాను."

"అటెలిపోతున్నారు! ఇల్లు ఇక్కడుంది బాబూ, అదిగో ఆ యెర్రమేడ పందులో."

వెనక్కి చూశాను. ఓహో, అదా సంగతి !

"తమరు ఎర్రబాబుగోరి పమాళ్ళు గదు బాబయ్యా?" అన్నాడు.

"అవునయ్యా!" అని విసురుగా పందులోకి వెళ్లాను.

అన్నట్టు ఇది మనిల్లు కాదు; మనింటి పేరు విడిదంటారు—అని జ్ఞాపకం రాగా మళ్లా వెనక్కొచ్చి ఇవతల వీధిలో వున్న యింటికి వెళ్లాను. ఏడూ పలభై అయింది. ఎలెక్ట్రిక్ లైట్లుండగా కిరసనాయిల్ దీపాలు పెట్టారేం—అనుకుంటూ వుండగా ఊళ్లో

(37-వ పేజీ చూడండి)

# నిలువుటద్దం

## 1



బాల్యదశలో ఉండగా సుబ్బలక్ష్మిని చూచినవా రెవ్వరైనా,* కథానాయిక కాగల కళ్యాణ గుణాలతో అవతరించిందని ఊహించలేరు. జీవిత పరిస్థితీ, కుటుంబయోగ్యతా, తలిదండ్రుల వైఖరీ, తన వ్యక్తిత్వమూ, తక్కిన వాతావరణమూ, అన్నీ ఆమెకు ప్రతికూలాలుగానే పరిణమించినాయి. ఐనప్పటికీ పుట్టినందు కొక విధమైన ప్రసిద్ధిలేకుండా నిద్రపోగూడదని ఆమె ప్రతిజ్ఞ చేసుకుంది.

ఆమె తండ్రి సర్వసాధారణుడైన రైల్వే ఉద్యోగి. లోకతిరస్కారానికి అర్హుడు కాకుండా, అంటే - అంత బీదవాళ్ళ క్రింద పరిగణింపబడకుండా కాలం గడిపే గట్టి మర్యాదస్థుడు. అందవికారాల్లో అగ్రగణ్యుడైనప్పటికీ అధికరసికుడై "వీరబాహు" అనే పేరుకు విభవాన్ని కూర్చినాడు. పూర్వకాలంలో వీరబాహు వొకడు హరిశ్చంద్ర నాటకంలో వేషానికి ఒప్పుకున్నందున శ్మశానాధికారిగా ఉండి, విశ్వామిత్రుని అనుగ్రహానికి లొంగవలసి వచ్చింది. మీ రంతా నమ్ముతారో, నమ్మరో! కాని, యీ వీరబాహువు స్వసామర్థ్యంచేత సంసారాన్నే శ్మశానంగా మార్చి తిరుగుతాడు గనుక సభ్యుడనిపించుకునే అదృష్టం పట్టింది. ఏమైనా అవకతవక లుండడం మానవస్వభావమే కాబట్టి, అతడి విషయంలో మన మంతగా నొక్కి పలుకవలసిన అగత్యం లేదు. చాటుమాటున కొంద అతన్నిగూర్చి, తాటిచెట్టంత ప్రమాణంగల దయ్యమనీ, నల్లని చింతమొద్దనీ నానావిధాల నిందిస్తారు; సత్యాన్ని గుర్తించి అజానుబాహు విగ్రహుని గానీ, నీలమేఘచ్ఛాయగల మహానుభావుడని కానీ అనరు. అందువల్ల అత డాగ్రహించి, ఆయా యిండ్లలో ప్రవేశం దొరకనప్పుడు కసి తీర్చుకోడానికి కొద్దిగా

శ్రీ భమిడిపాటి రామగోపాలం

హస్తలాఘవాన్ని ప్రదర్శిస్తాడు. అప్పటికైనా తమ తప్పు గుర్తించే యోగ్యతలేని లోకులు శాపనార్థాలు పెట్టి అతని ఉసురు పోసుకుంటారు. నడుమ నడుమ ఆకాశరామన్న అర్జీలు పెట్టి, అధికారులతో చెప్పి, ఉద్యోగం ఊడబెరికిస్తారు. కాని, అంతమాత్రానికే అధైర్యపడి ఊరుకునే జాతకమతనిది కాదు. తన శక్తియుక్తులు పూర్తిగా ఉపయోగించకపోతే, అత దర్ధాంగినైనా అను పెట్టి పోయిన ఉద్యోగాన్ని పునః సేకరిస్తాడు. ఈలోగా కొంత ఆలస్యం జరిగితే, ఆ సమయం వ్యర్థం కాకుండా టికెట్టులేని తీర్థయాత్రలకు బయలుదేరి, బంధువులయిండ్లలో తిష్టలు వేస్తూ తిరిగివస్తాడు. ఎంతెంత దూరాల్లోనో ఉన్న తమ యిండ్లకువచ్చి, అతను బంధుప్రీతి ప్రదర్శించడాన్ని మెచ్చుకోడానికి బదులుగా, ఆ గృహస్థులు మాత్రం తిండిదండుగని తిట్టిపోస్తారు. ఆ సంగతి మాచాయగా గ్రహించి, అత దూరుకోలేక తన సహజగుణమైన హస్తలాఘవాన్ని అంతో యింతో ప్రకటించి తీరుతాడు. అతను రైలెక్కిందాకా యేమీ తెలుసుకోడానికి వీలుండనందున, పరోక్షంలో మాత్రమే వాళ్ళు పశ్చాత్తాపపడడానికి అవకాశం చిక్కుతుంది. ఐతే, దొరికిన అవకాశాన్ని సరిగా వినియోగించుకో లేని వాళ్ళ అసమర్థతకతడు బాధ్యుడౌతాడా?

సుబ్బలక్ష్మి తల్లి మహాపతివ్రత. భర్త అవసరాన్ని తీర్చడమే ఆమె ఆదర్శం. అందువల్ల ఆమె యే పనిచేసినప్పటికీ అది పతివ్రతా ధర్మమే అని గణించే యోగ్యత లేని లోకులను నిర్లక్ష్యంగా చూచి, తన కర్తవ్యాన్ని తాను నెఱవేర్చుకుంటుంది. ఆమె జీవితచరిత్ర స్త్రీజాతి కలంకారమో, వికారమో నిర్ణయించలేక, అందరూ ఘోరమని మాత్రం ఘోషిస్తారు. మన దేశంలో స్త్రీ గౌరవం బొత్తుగా లేదని గట్టిగా తెలుసుకున్న యిల్లాలు కాబట్టి, ఆమె ఆగ్రహాన్ని మ్రింగి, ప్రాణాలు బిగబట్టి, ప్రతిష్ఠగా బ్రదకడానికారంభించింది. స్త్రీ స్వాతంత్ర్యానికి తానే మార్గదర్శకురాలై చిత్రంగా వ్యవహరిస్తుంటే, అర్థం చేసుకోలేని ఛాందసులంతా ఆమెను హీనంగా చూస్తారు. పోగొట్టుకున్నప్పుడెల్లా భర్త కుద్యోగప్రాప్తి కలిగించడానికి చేసే త్యాగమైనా లోకులు గుర్తించలేకపోతే, ఆమె దోషమేముంది?—ఆమె ఉద్దేశంలో కుల మత జాతి వివక్షతలన్నీ బూటకం. అందువల్ల సాధారణంగా మన నల్లవాళ్ళకంటే, తెల్లవాళ్ళే ఆమెకు నచ్చుతారు. ఆ స్వేచ్ఛా, ఆ ప్రేమా, ఆ ఆకర్షణా, ఆ భోగం—అవి మన వాళ్ళలో గగన కుసుమాలని ఆమె చిన్నప్పుడే గ్రహించింది. అంతే కాక, జీవితాంతంలోనైనా తనకున్న సంగీతకళాభిమానం ప్రదర్శించడానికై, ఆమె మనసారా ఒక సన్నాయిపాటకునికి శరీరాన్ని సమర్పించింది. ఈ దేశంలో యిటువంటి కళాభిమానానికి ఆదరణ లేకపోబట్టి, ఆమె పవిత్రక్షేత్రమైన కాశీలో ఆపని సాగిస్తూ అక్కడే నిలిచి పోయింది. ఈ కార్యం జరుగబోయ్యే ముందుగానే ఆమె భక్తిని మెచ్చుకున్న కాశీవిశ్వనాథుని అనుగ్రహంవల్లనే కాబోలు!—సుబ్బలక్ష్మిని కనగానే చావడానికి బదులు, పందెంకట్టి బ్రదికిందట! అంతకుముందే పుట్టిన మరొక కూతురూ, వెనుక ఒక పిల్లవాడూ ఆ కుటుంబానికి అధిక్యత కలిగించినారు. ముచ్చటగా ముగ్గురు పిల్లలున్న కాపురంలో కావలసినన్ని వింతలు!—ఆమె చూచిన వింతల్లో అవి జమా, లెక్కా? అందుకోసం జ్ఞానమ్మ పేరామెకు సార్థకం.

జ్ఞానమ్మకూతురు సుబ్బలక్ష్మి మాత్రం సామాన్యురాలని యెవరనగలుగుతారు? ఆకార మడవీ, రూపు రత్తా ఐనప్పటికీ, అసాధ్యురాలే అయింది. పుట్టినప్పుడు పూర్తి పరీక్షిస్తేగాని, పిల్లో, పిల్లవాడో తేలలేదని మంత్రసాని కూడా అనుమానంలోపడి అఘోరించిందట! ఈ హేతువునుబట్టి, సుబ్బలక్ష్మి ఆడపిల్లయినప్పటికీ, అన్నీ మగలక్షణాలే అలవఱచుకుందని ఏ మూహించగలుగుతారు.

మగపిల్లలాడే ఆటలన్నిటి మీదా ఆమె కిష్టమెక్కువ. ఆడపిల్లల గుజ్జెనగూళ్ళూ, గొబ్బితట్టడాలూ, బొరాకట్టలూ, పచ్చీసులూ, పులిజూదాలూ, బొమ్మల పెండ్లిండ్లూ—కేవల పరిశ్రమప్రతికూలాలనీ, సులభాతిసులభాలనీ గ్రహించి, అవి తనవంటి కథానాయకి కనర్హాలని ఆమె తృణీకరించింది. ధీరవీరవనితాగణమైనా మన దేశంలో అలవాటుపడడాని కవకాశం లేని 'సైకిలుసవారీ' అంటే ఆమె ప్రాణం విడుస్తుంది. తోటలూ దొడ్లూ తిరిగి పూలు కోస్తుంది; పండ్లు దొంగిలిస్తుంది. ఐతే ఆమెకు తోటమాలితన మిష్టం లేదు. అబలాజన సహజమైన పూలమీది యిష్టంకూడా లేదు. అవి కోయడం మగవాళ్ళ శేషింపచడానికే—అంటే, వాళ్ళ నాకర్షించి మోసగించడానికేమో?

ఆమె శక్తిసామర్థ్యాలు లత్యద్భుతాలు; ఎంత చదివినా యేమీ అర్థం కాకపోవడంలో ఆమెదే అగ్రతాంబూలం. అందువల్ల చదువుచెప్పే పంతులమ్మలు ఓడిపోవలసి వచ్చింది తర్వాత, తల్లి దగ్గర శిక్షణ పొందగా పొందగా, మంగలి రంగడు తల గొరిగేపాటం దబ్బున వచ్చింది. తన కభిమాన కళైన సంగీతంలో ప్రవేశం కలిగించడానికి తల్లి ప్రయత్నించి, తుదకు విసిగి విసర్జించింది. సుబ్బలక్ష్మికి సంగీతమంటే తలనొప్పి, కడుపునొప్పి కలిగేది. ఆ నొప్పి క్రమంగా డాక్టర్లకు దుస్సాధ్యమౌతుందని తోచి, సంగీతం మాన్పిస్తే, ఆ రోజున సుబ్బలక్ష్మి అమితంగా సంతోషించింది. ఇంతో అంతో డ్రాయింగులోనూ ఆమె పరిశ్రమచేసింది. వ్రాసి పారవేసిన కార్డులూ, కవర్లూ ఆ డ్రాయింగులో మునిగి తేలేవి. చెట్లూ చేమలూ, యిండ్లూ వాకిండ్లూ, కోళ్లూ, కోడిపిల్లలూ—ఇవన్నీ ఒకదానొకటి పోలి యింపుగా తయారయ్యేవి. తండ్రి నేర్పిన లెక్కల్లో కూడా ఆమె అంతే పాండిత్యాన్ని సేకరించింది. వీలైతే, యెప్పుడుపడితే అప్పుడే చదువు నుంచీ చల్లగా జారుకోడానికి ప్రయత్నించేది. ఎంత ముసలాగ్రబుద్ధి! ఏమి జోక్కుద్ధి!—ఇన్ని విధాలైన విద్యల్లో పాదరసంవలె ప్రవహించలేకపోయినా, పదేళ్ళ యీడుకే ప్రతిభావంతురాలుగా కనబడడానికి గిల్లికజ్జాలు పెట్టుకుంటూ, గింజుకొని యేడుస్తూ, కేరింతలుకొట్టి నవ్వుతూ, ఉన్నచోట టాక కాలికి తేస్తూ, ఉద్దండంగా ప్రవర్తించేది.

అవి శారదా చట్టానికి ముందురోజులు. అందుచేత సుబ్బలక్ష్మి వివాహం ఆ యీడులోనే జరుగవలసివస్తే అక్కడ సైతం అఘాయిత్యం తప్పకపోయింది. తల్లిదండ్రులు తమ బాధ్యత తీర్చుకోడానికి ఎంతో శ్రమపడి కుదిర్చిన సంబంధమైనప్పటికీ, పెండ్లికొడుకు వృద్ధుడనీ, అతనికి తాను కొంత ధనానికి అమ్ముడుపోవడం అన్యాయమనీ, సుబ్బలక్ష్మి స్వయంగా మైక్రోఫోనై, ఊరందరికీ తెలిసేట్టు ఓపికగా యేడ్చింది. ఆడపిల్లల యేడుపు వినడానికి వీనులుగానీ జాలి పడడానికి గుండెలుగానీ ఆంధ్రదేశంలో లేక పోబట్టి సరిపోయింది కాని, లేకుంటేనా?............

## 2

పదిహేనేళ్లు నిండుకొచ్చేప్పటికి సుబ్బలక్ష్మి పూర్తిగా మారింది. వయసు తన పొంగు అందాన్ని బలవంతాన యీడ్చుకొచ్చింది. రూపంలో అభివృద్ధి సమృద్ధిగా కలిగింది. రంగు ముదిరి రాజసాన్ని మార్చింది. అధోపరి అవయవాల్లో విస్తరింపదగినవీ, విజృంభింపదగినవీ తమతమ హద్దులు మీరిపోయాయి. వంపులూ, నిలువు గీతలూ, మిట్టలూ, పల్లాలూ, వేటికవి స్ఫుటంగా వీలైనంతవరకూ శరీరంలో తీరుకున్నాయి. కండ్లు, క్రొత్తక్రొత్త చూపుల కలవాటుపడినాయి. ముఖికి పదార్థాల మీద మోహం తగ్గి, నాజూకు వేషాల పై మోజు హెచ్చింది. తల్లిదండ్రులు తెగాదిగ చూచి "సుబ్బలక్ష్మి శుభలక్షణాలు నేర్చుకుంది; విభవాన్ని అనుభవించే విలక్షణ రూపంతో కండ్ల పండువుగా కనబడుతూంది"—అని మెచ్చుకోడం ఆమె వీనులకెంతో యింపుగొల్పింది. అనుకోని విధంగా అంత మార్పొకసారి తనకు రావడాన్ని చూచి ఆమె అబ్బురపడుతూ, విశృంఖలంగా ప్రవర్తించడానికి ఆత్రపడసాగింది. ఐతే, వృద్ధభర్త ఆమె దారికడ్డు వచ్చి, విశృంఖలత్వాన్ని విషంవలె చూస్తూ తన అధికారాన్ని చలాయించడానికి కొన్ని ప్రయత్నాలు చేసినాడు. అధిక ప్రయత్నాలన్నీ, అధిక ప్రసంగాల కన్నదమ్ములే అని గ్రహించే యోగ్యత సుబ్బలక్ష్మికి లేదూ?

పదిహేను మొదలు పందొమ్మిదేళ్ళ వఱకూ, సుబ్బలక్ష్మి కథానాయికలక్షణాలు పట్టించుకోడానికి చాలా శ్రమపడింది. వీళ్ళనూ వాళ్ళనూ అడిగి అనుగుణమైన శిక్షణ పొందింది. కథానాయికామణుల కవసరమైన గ్రంథాలన్నిటినీ త్రిప్పి, అందులో తనకు సరిపొయ్యే ఉటంకింపులను ఉద్ధరించి, కంఠపాఠం చేసింది.

తారాశశాంక విజయంలోనుంచీ:—

"మగడు మగండనంగ మదినుక్కువరావ్వని యుండదో? కంటికింపగు నతం డెవ్వడో అతడే!"............ విజయవిలాసంలో నుంచీ—

"ఆ సిగ్గరు సిగ్గులే దిటులు చేసిన పిమ్మట నుండవచ్చునే?"—

బిల్హణీయం నుంచీ—

"అంధుం డెక్కడ? చంద్రు డెక్కడ?"...

వేమన శతకరత్నావళిలో ఆమె కధిక సామగ్రి లభ్యమయింది—

"రాళ్ళు జేవుకైన రాకులు ప్రమింగవా?"—

"తలలు బోడులైన తలపులు బోడులా?"—ఇత్యాది.

కవిచౌడప్ప శతకంలోనుంచి—

"పగలాడికి ముసలాతడు
మగడైతే దాని చింత మఱియింతంతా!
జగదీసుడు తా నెఱుగును;"—

చల్ మోహనరంగ పాటలోనుంచి:—

నీకూ నీవారు లేరూ, నాకూ నావారు లేరూ"—

ఇటువంటి భాషాభివృద్ధిలో ఆమె ఆరితేరింది. తక్కిన అన్ని విధాల్లోనూ తగిన పాండిత్యం సేకరించింది. తాను స్వయంగా పద్యాలు వ్రాయదలచి, ప్రయత్నం సాగక వదలిపెట్టింది. తరువాత జ్యోతిషం సాధించదలచి, తత్సంబంధంలో

పండితులను ప్రశ్నించి, ఊపిరితిరుగకుండా చేసింది. ప్రస్తుతం తన దారిద్ర్యాన్ని మఱచి, తగిన జత లేదని విచారిస్తూ, తన జన్మలో యేదో ఒక ఘనకార్యం తలపెట్టి, కొనసాగించడానికి ఘోరంగా పోరాడుతూంది. తన్ను మెచ్చుకోగల ధైర్యశాలురే లేరని లోకాన్ని యీసడిస్తుంది. ఆ పూర్వవ్యక్తిత్వం కాదూ?

ఇంతకూ ఒక యువతీరత్నం, కథానాయకి కాదలచుకుంటే, అఖిలజగమూ యేకమై ప్రయత్నించినా, ఆపతరం కాదు.

## 3

సుబ్బలక్ష్మికి తారాబలం మంచిదై, భర్తవంక చుట్టాలతో పరిచయం కలిగింది. వాళ్ళందరూ తొల్తొలుత ఆమెను గొప్పగా చూచేవాళ్ళు. రంగూమూడు వందల జీతగాడి భార్యనెవరు హీనంగా చూడగలుగుతారు? ఆమె క్రొన్నాళ్ళు తన పుట్టింటిని మఱచి, అత్తామామలు లేని మెట్టినింట్లో అత్యంత స్వతంత్రురాలుగా మెలగింది. భర్త తనకు దాసోహమనేకొద్దీ, అతని నెత్తిన మిరియాలు నూరింది. మొహం మీంది ముంగురులు మట్టసంగా కత్తిరించుకొని, కెంపులు దున్నగా గోరుక్కొని, చిత్రవిచిత్రమైన వేషాలు వేసింది. సగం తెల్లవాళ్ళ సాంప్రదాయాలను అనుకరిస్తూ, తల్లికి తగిన కూతురనిపించుకోడానికి ప్రయత్నించింది. తండ్రిని బహిరంగంగా పదిమందిలో నిరసిస్తూ, తల్లి నెక్కువగా పొగడింది. మగవాళ్ళను కొట్టవచ్చినట్టుండే మొహాన్ని ముప్పూటలా సబ్బుతో తోమి, పౌడరు పులిమి, పెదవులకు రంగులు వేసి, వింత వింత విదేశీ వలిపాలు ధరించి, విభ్రమించను మొదలుపెట్టింది. ఈ చర్యలకు హేతువు వేఱేమీ కాదు; ఆమెకు లభించిన ఐశ్వర్యం అందరకూ ప్రదర్శించడమే!--ఐతే, చూపఱమాత్రం అపార్థాలు చేసి, ఆమె నవహేళనగా చూడడానికి ప్రారంభించింది. తుదకు దగ్గఱ బంధువుల్లోనూ యీ వ్యాధి వ్యాపించినందు కామె హృదయంలో ఆగ్రహించింది. సమయం వచ్చినప్పుడు వాళ్లను వేఱుపరచి శిక్షించడానికి కూడా నిశ్చయించుకుంది.



హఠాత్తుగా అబ్బిన ఐశ్వర్యంవల్లనో, యౌవనమదంవల్లనో, రూపరేఖావిలాసాలు మాచుకున్న గర్వంవల్లనో, కేవల స్వాతంత్ర్యవిహారంలో కలిగే ఆనందంవల్లనో? - చెప్పలేము కాని, ఆమెకు అనుకున్న పని సాధించే శక్తిసామర్థ్యాలు అపారంగా వృద్ధిచెందినాయి. బంధువులు మాత్రం యెదుట గౌరవిస్తూ, చాటున చిన్నచూపు చూడడానికీ, యెగతాళిచేసి నవ్వడానికీ, హీనంగా నిరసించి తిట్టడానికీ అలవాటుపడినారు. కథానాయకి కాబోయే సుబ్బలక్ష్మికి సామాన్య బంధువుల భూషణదూషణలతో అక్కఱలేకపోయింది. కాల మెప్పుడు కలిసివస్తుందా అని ఆమె కనిపెట్టుకొని కూచుంది. అంతటి సకల కళ్యాణగుణసంపన్నురాలు తనయిల్లాలైనందుకు భర్త కూడా దుఃఖపడి లాభంలేదు కనుక, సంతోషించడానికే సర్వధా యత్నించినాడు.

ఇంత చెప్పి, ఆమె భర్తను వర్ణించకపోవడం అవమానకరంగానూ, చరిత్రకు గొప్ప లోపంగానూ, ఉంటుంది. అతడు సాంప్రదాయకుటుంబంలో పుట్టి, పుట్టుశాస్త్రి కాక పెట్టుశాస్త్రిగానే ప్రసిద్ధికెక్కిన మహామహుడు. ఇంగ్లీషుచదువులో హెచ్చుతరగతులు నచ్చక, తచ్చుతరగతులలోనే తగినన్ని దండయాత్రలుకొట్టి వదలిపెట్టిన విద్వాంసుడు. కేవల భుజబలంతోనూ, గప్పాలుకొట్టగల నోటిబలంతోనూ జీవితయాత్ర సాధిస్తూ, స్వప్రయత్నలభ్యమైన వ్యాపారసంబంధపు కంపెనీ ఉద్యోగంలో గట్టివాడనిపించుకున్న లౌకికుడు. కష్టపడి సంపాయించే ధనంలో దమ్మిడీ ఖర్చుపడినా ఓర్వలేక, అవసరాలు కూడా మానుకొని అదే పనిగా మూటగట్టిన ఆర్థిక కార్యదక్షుడు. బాల్యం వదలి యౌవనం మొలిచినప్పటినుంచి మగజన్మ సార్థకం కావడానికి మారీచ సుబాహుతంత్రాలన్నిటినీ ప్రయోగించి, మస్తుమంది మగువలతో ప్రకృతివాంఛలు తీర్చుకొని, మానమర్యాదలకూ, దేహదార్ఢ్యానికీ, తిలాంజలు లర్పించిన మార్గదర్శకుడు. బలం తగ్గినా పౌరుషం తగ్గగూడదనే అభిప్రాయంతో, తొలిభార్య మరణానంతరం మలిభార్యను స్వీకరించి, పట్టుదలతో ప్రతాపాలు కొట్టే పరమయోగ్యుడు. లోపల లొటారమైనప్పటికీ, పైకి పటారంగా నటిస్తూ, పరులయెదుట లొంగక పైచేయిగానే తిరిగే ప్రబుద్ధుడు. పడుచుప్రాయంలో దాసిగాచూచిన పాపపరిహారార్థం, వృద్ధత్వంలో భార్యను దేవతగా తలచి పూజించే పురుషోత్తముడు.

అంతేనా? మాట మాత్రానికైనా భార్య దూషణ సహించలేని ప్రణయోపాసకుడు!-- శాస్త్రి అనే పేరుకు, 'శస్త్రసంబంధి', అనే అర్థం అన్నివిధాలా సార్థకంచేసి తీరగల సరసుడు కాబట్టి, ప్రతిప్రాతఃకాలమూ స్వయంగా క్షౌరంచేసుకుంటాడని యథార్థం తెలిపినందుకు మీ రన్యథా తలంపగూడదు. ఎంతవాడు కానిదే, కథానాయకి కాగల సుబ్బలక్ష్మిని గృహలక్ష్మిగా కోరి తెచ్చుకోగలుగుతాడు?

ఆమె పాదప్రవేశమైనప్పటినుంచే తన భాగ్యం ప్రబలిందని కూడా అతడు పదిమందిలో తప్పెటకొడతాడు.

ఆమెను--'ఆమెగారు'--అని గౌరవంగానూ సంబోధిస్తాడు. అంతటితోనూ తనివితీరనప్పుడు అమ్మగారని, అవిడగారనీ, గోరారా పిలిచి సంతోషిస్తాడు. "ఆమె పేరు మొదట సుభలక్ష్మి. ముద్దుపేళ్లను మొద్దుపేళ్ళుచేసే ఆంధ్రలోకంలో పుట్టబట్టి సుబ్బలక్ష్మి కావలసివచ్చిం"దని అంగలారుస్తాడు. ఇంతటి అభిమాన ప్రదర్శనానికి బహుమానంగా ఆమె అతన్ని "మాస్టర్!"--అని ముద్దుగా పిలుస్తూ, లోలోపల విధిలేక క్షమిస్తుంది. ఆదర్శప్రాయులైన ఆ దంపతుల వైభవాన్ని చూడలేక, లోకం వెక్కిరిస్తుంది; "పసుమంటే పదివేల రొక్కముంటుందేమో? ఆదేమంత లోకాతీతం? లక్షాధికారులకైనా యింత మిడిసిపాటుండదు. వీళ్ల గొప్పతనమేమిటి పాడూ?" అని కూడా ఆక్షేపిస్తుంది. అయితే? వాళ్ళను మాత్రం లోకం లెక్కయేమిటి?

## 4

సుబ్బలక్ష్మి కథానాయకి కావడానికి మొదటి మెట్టుగా, వాళ్ళ బంధువులింట్లో ఒక వివాహం జరిగింది. అక్కడి వేడుకలన్నీ ఒక యెత్తు--ఆమె వేడుక ఒక యెత్తు! అందఱి స్త్రీలకూ లేని ప్రత్యేకత ఆమెకు మాత్రమే అన్వయిస్తుంది. కారణమేమంటే తక్కిన కాంతలు బాలగోపాలం సాధారణ కుటుంబాలు చక్కదిద్దుకునే సాంసారిక పద్ధతిలో సంచరిస్తారు. ఆమె తన సహజ కథానాయికత్వాని కనుగుణంగా ప్రవర్తిస్తుంది. లోపల కాగరా తొడిగి, పైన ఉల్లిపొరవంటి ఊదాచీర ధరించి, పలచని బాడీ మీద చేతులులేని సిల్కుజైకెట్ సింగారిస్తుంది. శిరోజాలు క్రాపుగా దువ్వి, కడపట సవరాలుపెట్టి జడవేస్తుంది. అత్తరూ, సెంటూ ఘుమాయించేట్టు అంతటా రాచుకుంటుంది. "నేను పిల్లను. మీరంతా పెద్దలు. నాకూ మీకూ సంబంధమేమి?"మని

నలుగురికీ ఉపన్యసిస్తుంది. కండ్లకద్దాలూ, కాళ్లకు బూట్లూ, చేతికి గొడుగూ సంతరిస్తుంది. లేదెందుకు? అప్పుడే సీమనుంచీ విమానంలోవచ్చి దిగిన దొరసానివలెనే ఉంటుందని అందరూ అనేమాట! — నా సవరణ యేమంటే, సీమవాళ్ళు తెల్లదొరసానులైతే, ఆమె నల్లదొరసాని

ఆ పెండ్లికొచ్చిన దంపతుల నందరినీ ఆమె తలచితలచి చూచింది. ఎవరుపట్టినా యీడూ జోడుగానే ఉన్నారు ఆ భాగ్యం తనకు పట్టకపోయిందే? — అని ఆమె హృదయంలో అగ్ని రాజింది. ఏదైనా నాటక మాడడానికి సైతం యెవ్వరూ సహాయపడనందున, ఆమె పూర్తిగా పగబట్టింది. కాని, పెండ్లి సందడిలో ఆ సంగతి గుర్తించగలవాళ్లే లేక పోయినారు. "ఏమైనాసరే! నా కోపం తీర్చుకోక తప్ప,"దని ఆమె గట్టిగా ఒట్టు పెట్టుకుంది. ఒక నిరపరాధిని అపరాధిగా మార్చడానికి సాహసించి, అతనిపై కేసు బనాయించి, రహస్యంగా భర్త చెవిలో ఊదింది. ఆభర్త ఆ సమయానికి మోహాంధుడై, అందరిలోనూ అసంగతి ప్రకటించి, అనపరాధిని శిక్షించబోతే, అల్లరి పెద్దదయింది. వక్కరించబోయి వెల్లకిలపడినట్టుగా, ఆలుమగలిద్దరూ పెండ్లి వదలి పెడసరంగా అవతలపడినారు. ఐతే, ఆరంభంలోని అపజయం ఆఖరు విజయానికొది సోపానంగా భావించి, తృప్తిపడింది, సుబ్బలక్ష్మి.

మరికొన్నాళ్ళకు రెండో ప్రయోగం, వేరొకచోట విపరీతంగా సాగించింది. పట్టి అమాయకబాలకు డామె ప్రయోగాగ్నికి మిడుతైపోయి మిడికినాడు. అతని యెదుట అంగాంగసౌందర్యమంతా అగపడేట్టు చీరవిప్పికట్టుకుంటూ, రైక విడిచి తొడుక్కుంటూ, పైట జార్చి వేసుకుంటూ, అనేకరకాలుగా ఆకర్షించడానికి ప్రయత్నిస్తే, అతడు నిర్ఘాంతపోయి చూచేవాడు. ఇదంతా యెవ్వరూ లేని మూలచాటుల్లో జరిగేది. అందరూ యింట్లో ఉన్నప్పుడు, వీళ్ళిద్దరూ దొడ్లో; అందరూ దొడ్లో ఉన్నప్పుడింట్లో. ఈ విధంగా మాయలో మునిగి క్రమంగా బాలుడు భావప్రాప్తుడైనాడు; ముఖంలో నెత్తురుదికింది; హృదయ ముబ్బింది; ఒళ్లు వణకింది; సద్యోనుభవ మధుర ప్రపంచ మొకటి యెదుట తాండవించింది. దూరంగా ఉండేవాడు జరిగిజరిగి సమీపించడానికి సాహసించినాడు. విచక్షణగల సుబ్బలక్ష్మికా రహస్యం అర్థమయింది. ఇద్దరూ ఒకరినొక రానుకొని కూర్చోడమూ, ఆ మాటా యీమాటా ఆడుకోడమూ, నగుమ నగుమ నవ్వడమూ, పరవశులై పండుకోడమూ మొదలయింది. తదుపరి బాలుడు బాలునివలెకాక, ప్రౌఢుడుగా మారి, తమ రహస్యం బట్టబయలౌతుందనే భయమైనా లేక, అనుభవా లన్నిటినీ డైరీవ్రాసి, అప్పుడప్పుడూ రహస్యంగా చదువుకో సాగినాడు. కడకొకనాడది ప్రారబ్ధం బైటబడితే, యింట్లో పెద్దవాళ్లు చావగొట్టి చెవులు మూసినారు. చేసిన ప్రయత్నం కొంత కొనసాగినందుకు సంతోషిస్తూ, సుబ్బలక్ష్మి ఆ ఊరు వదలింది.

ఇంకా కొంతకాలాని కింకో పెండ్లి తటస్థమయింది. ఆ పెండ్లిలోనూ విశేషమేమీ వీలుకాక, సుబ్బలక్ష్మి తనకలాడింది. పెండ్లికూతురుతో కొంత స్నేహితం కలిగించుకొని, ప్రీతిగా సంచరించ, రాత్రికి ప్రక్కనే పడుకొని నిద్రపోయింది. తెల్లవారిమాస్తే, పెండ్లికూతురి ఆభరణాలు మాయమైనాయి. అనుమానం సుబ్బలక్ష్మి మీదనే పడింది. ఐతే, తర్జన భర్జనలుచేసి, అడగడానికి అందరూ భయపడినారు. ఘనకంతుడైన ఉద్యోగస్థుని భార్య! — నల్లదొరసాని! — అంతటి దర్జాలోనున్న కథానాయకని కదలించి సామాన్యులు బ్రతుకగలరా?

## 5

ఉద్యోగరీత్యా ఉత్తరహిందూస్థానమంతా గాలించి, శాస్త్రిదంపతులు తుదకు షోలాపూరు చేరుకున్నారు. వివిధదేశాల్లోని వివిధజాతుల దురలవాట్లన్నిటినీ సుబ్బలక్ష్మి సేకరించుకొని, స్వదేశీయుల యెదుట చాలా గొప్పగా నటిస్తుంటే, అందరూ వేళ్ళుమూపి నక్కరించ నారంభించినారు. ఏమైనప్పటికీ, ఆమె కీర్తి అందరి నోళ్ళల్లో ఆడింది. అన్ని భాషల్లో అల్పాల్పమైన పాండిత్యం లభ్యమయింది. జీవిత సార్థక్యానికి చిహ్నాలు పొడసూపినాయి. కథానాయిక కావడానికి అవకాశాలు కూడా బోలెడైనాయి. పరగ్రామంలో ఆమె స్వాతంత్ర్యాన్ని అరికట్టేవాళ్ళు లేకపోయినారు. ఇరవై నాలుగు గంటలూ యెవరు కనిపెట్టుకొని కూర్చుంటారు?

శాస్త్రి ఆఫీసుకు వెళ్ళగానే, సుబ్బలక్ష్మి బజార్లు తిరగడానికి బయలు దేరేది. బండివాళ్ళతో సహా బాగా మాట్లాడేది. దుకాణాల మీదికి వెళ్ళి దుస్తులు బేరమాడేది. ఏమో చేయ బోయి యేమో చేసేది. ఆమె మనసులోని ఆందోళనకు గల హేతువేమో తెలిసికో డానికెంతో ప్రయత్నించేది. ఎక్కడో, యేదో తప్పు చేసినట్లుగా ఉండేది. అతప్పే మిటో అర్థమయ్యేదికాదు. అంతా దుర దృష్ట భాజనంగా తోచేది. ఆమె నరాలు స్వాధీనంలో లేక, తట్టుకొని పడినట్లుగా తల్లడిల్లేది. భర్తను భర్తగా చూచుకోడం సాధ్యం కాకపోతే, బిడ్డల తండ్రిగా నైనా చూడడానికి నోచుకోరాదూ?–అను కునేది.



తన పెండ్లినాడు తల్లిదండ్రులకైనా తృప్తి లేనట్లే ఉండేది. కేవల ధనానికాశించి, వాళ్ళు తన్ని వృద్ధు కంటగట్టినారు. తానింత కిబ్బడివయసులో ఉండగలిగితే యెంత బాగుండేది? పెండ్లనే నిర్బంధమే లేకపోతే, యీబాధ పడేదా? ఇన్ని తీరని కోరికల కాస్పదమెక్కడ? తాను సీతాకోకిల చిలుకవలె సింగారించుకొని లాభం? భావిజీవితం అగోచరం – వ్యర్థం – అపయో జనం!–త్వరలోనే తానూ ముసలిదై తీరుతుంది. ఒక్కొక సంవత్సరం రెక్కలు కట్టుకొని పరుగెత్తు తూంది. తదుపరి చింతిస్తే జగిరిపోయిన కాలం వస్తుందా? ఈ రూపం – యీపచ్చి జవ్వనం – అడవిని గాసే వెన్నెల! అంతేనా?

తన సుఖాన్ని పాడుచేసి, స్వార్థమైనా సాధించుకోలేక, చప్పరించే శాస్త్రితో యెన్నాళ్ళని వేగడం? అతడు స్వేచ్ఛగా బాల్యయౌవనాల్లో సంచరించి, బంగారు వంటి బలాన్ని పోగొట్టుకోలేదూ? జీవితంలో తను కవసరాలని తోచినవాటి నన్నిటినీ అనుభవిస్తూ—నోరులేని అబలల గోడు పోసుకుంటారు మగవాళ్ళు. మగువల పాలిటికి శోకబంధప్రపంచాన్ని సృజించిన వాళ్ళు పురుషులు కాకుంటే మరెవరు?—

ఇంతకూ ధైర్యం తెచ్చుకొని, యేదో ఒక ఘనకార్యం చేసి, ప్రసిద్ధికి రాకుంటే, బ్రదుకెందుకూ?

* * *

సుబ్బలక్ష్మి తన జీవితకావ్యంలోని పరాకాష్ఠ – ఉత్తరోత్తరాభివృద్ధి–సాధించ డానికై పతకం వేసుకుంది. ఉన్నట్టుండి జబ్బుపడినట్టు ప్రకటించింది. ఇంటి యెదు టనే ఉన్న డాక్టరువంతు వచ్చిపడ్డది. అత డెంత పరీక్షించినా యేమీ అర్థం కావడం లేదు. హృదయం సరిగానే కొట్టుకుం టుంది.మనిషి సుస్పష్టంగా కనబడుతుంది. కాని వ్యాధేమిటి?

డాక్టరు మంచి పైలా పచ్చీసులో ఉన్నాడు. అతని స్టెతస్కోపు అందాన్ని కొలుస్తుందా? అంతరంగంలోని ఊహలు గ్రహిస్తుందా? ఏమో? ఇదంతా విచిత్ర నాటకం!–ఆవిడ పగళ్ళువదలి, చికిత్సకోసం రాత్రిళ్ళు రాకపోకలు మొదలుపెట్టింది. వ్యాధికి చికిత్సకూ అతికినట్టు తోచింది. అంత పెద్దవ్యాధి నతడు కాబట్టి కుదుర్చ గలుగుతున్నాడని శాస్త్రి సంతోష పడ్డాడు. "అబ్బబ్బా! గుండె జబ్బే?- బల హీనతమే?" - అంటూ నడుమ నడుమ ఆశ్చ ర్యాన్ని పెంచుతూ, డాక్టరు సూచించే క్రొత్త సంగతులన్నీ కుతూహలంతో వింటున్నాడు.

ఆమె డాక్టర్ను పొగడితే, తానూ పొగడుతాడు. ఆమెకు శాస్త్రి స్వభావం పూర్తిగా అవగతమయింది. అంతకుముం దెన్నడూ చూపని అపారప్రేమను వర్షించి, దాసానుదాసుడుగా మార్చసాగింది. హఠాత్తుగా ఉప్పొంగిన యీ వఱదలో పడి శాస్త్రి కొట్టుకోపోసాగినాడు – ఎక్కడికో? ఆ ప్రదర్శనం నిజమో? స్వప్నమో?–అర్థం కావటంలేదు. ఆడించే ఆట, పాడించే పాటగా కొన్ని నెలలయ్యే ప్పటికి, సుబ్బలక్ష్మి విజయభేరి మ్రోగిం చింది. ఆమె – అనుకోని వినుకోకుండా – గర్భిణి!

బంధువులవఱకూ యీ వార్త ప్రాకింది. ఎవ్వరూ నమ్మలేకపోయినారు. "ఏదో జరిగింది! – 'స్త్రీ పుంవచ్చ – ప్రభవతి గృహే, తస్య గేహం వినష్టం' – (ఆడది మగాడివలె స్తరుగా యే యింట్లో నమర్తి స్తుందో, ఆ యిల్లు పాడవుతుంది) – అనే శాస్త్రకారుల వచనం సార్థకమైనట్లుంది. ఆయిల్లింక బాగుపడడం కలలోని వార్త," అంటూ కొందఱు విమర్శించినారు. కొందఱాశ్చర్యాన్ని మాత్రమే ప్రకటించి ఆరోజుకోసం యెదురు చూచినారు. మఱి కొందఱు ప్రత్యక్షంగా చూస్తేగాని, యే సంగతీ అనగూడ దనుకున్నారు.

తొమ్మిదినెలలూ నిండినాయి, తొందరగానే. శాస్త్రి సంతోషానికి పారమే లేదు. అతడు మ్రొక్కిన దేవతలందఱూ అనుగ్రహించినారు. ఆడిన తీర్థాలన్నీ పుణ్యాలు కురిపించినాయి. ఆడిపోసు కునేవాళ్ళ ముఖంమీద కొట్టినట్టు, అతని అదృష్టం హఠాత్తుగా ఫలించింది – సుబ్బ లక్ష్మి స్త్రీశిశువును ప్రసవించింది.

(30-వ పేజీ చూడండి)

# వినాయకుడి సంబరం

(13-వ పేజీ తరువాయి)

మీద కూర్చున్నట్టు కూర్చుంది; తొండం చాచుకుని నోరు తెఱచుకుని ఘీంకరిస్తూ.

అడుగున కబోదు ఊరికే ఏమీ తెలియక, చెట్టును తాను కౌగిలించుకుంటూవున్నా నన్న ఇదికొద్దీ కొంతసేపు, చెట్టే తనను కౌగిలించుకుంటూ వున్నదన్న ఇది కొద్దీ కొంతసేపు, కొట్టుమిట్టాడి తుదకు, ఒకానొక దైవోపహతిగా స్పృహతప్పి ప్రాణాలు విడిచి, ఆ చెట్టుకొమ్మల క్రింద ఏనుగు క్రిందా కనబడకుండా అణగారిపోయాడు.

సర్కసు మేనేజరు వచ్చినా ఏనుగును ఏమీ చేయలేక పోయినాడు. ఆరోజు వినాయకుడి చవితి కావడంచేతను, ఆ కూర్చున్న ఏనుగును ఎవరూ కూడా లేవనెత్తలేక పోయినారు. ఒక్కరూ అడుగున కబోదు బిచ్చగాడొకడు అణగాలి మృతుడయ్యాడని తెలిసికోలేక పోయారు. బిచ్చగాండ్లు బిచ్చకత్తెలు తదితరు లందరూ వినాయకుడి గుడివీధికి పోయి బాగులు తీసి అడుక్కుంటూ వుంటే యీవత్తని ఆనాడుండిపోయారు.——చూచిన ప్రజలందరూ, వచ్చిన జనమంతా, ఆ ఏనుగుకు బొట్టెట్టి, నోట్లోకి పళ్ళు ఉండ్రాళ్ళు అందిచ్చి, ప్రత్యక్ష విఘ్నేశ్వర స్వరూపం అని భజనలు చేశారు. ఏనుగు తన సహజ చాపల్యం కొద్దీ, తొండాన్ని ఆడిస్తూ, అలాగే కూర్చుంది. తన అడుగున ఒక కబోదు బిచ్చగాడు మఱి అరవకుండా, అరయకుండా, మరణించిపోయి వున్నాడు అని అది ఎఱుగునో ఎఱుగదో? ఏమైతేం! ఆలాగే కూర్చుండిపోయింది! అపర వినాయకుడిలా!

కబోదుయొక్క మరణ వృత్తాంతం అవలోకనం కానివాళ్ళకు పైని వివరించిన కథాభాగం అంతా వినోదవంతమే కావచ్చు కాని కథ వ్రాస్తూవున్న నాకుమాత్రం మిక్కిలి విషాదవంతంగా తట్టేని—ఏమా అంటే ఆ ఏనుగుక్రింద మరణించిన ఒక కబోదుబిచ్చగాడు వుండివున్నాడని నాకు తెలుసు. అయితే నేనుమాత్రం ఏమి చేయగలను? కలంతో "పాపం! పాపం!" అని మఱి నాలుగు పంక్తులు వ్రాయగలను. అంతే. చనిపోయిన కబోదు బిచ్చగాణ్ణి కాని, కూలిపోయిన ఆదిరిసెనచెట్టును గాని తిరిగి బ్రతికించలేను. లోకంలో నిత్యమూ మరణిస్తూవున్న వ్యక్తులెలా 'అయితే పునర్జీవులు కారో ఆలాగే కథల్లో చనిపోయిన వాళ్ళున్నా! వాళ్ళున్నా మర్త్యులే!

సాయంకాలం ఆ వినాయకచవితి నాడు, కథ విని, అక్షింతలేసుకుని, చవితి చంద్రుణ్ణి చూసుకుంటూ తిరిపెకత్తె కబోదు బిచ్చగాని నిమిత్తార్థమై, నైవేద్యం పెట్టుకువచ్చినట్టు ఒక బుట్టలో ఎక్కడ తీసికొని రాగలిగిందో పది వుండ్రాళ్ళు వేసికొని—"ఓరి మాంవా!" అంటూ కేకేసుకుంటూ వచ్చింది. మాంవ లేడు సరిగదా మాంవ కూర్చునే మానూ లేదు. క్రిందా మీదా చూసింది. మీదను ఏనుగుంది. ఏనుగుక్రింద కూలిపోయిన చెట్టువుంది. చెట్టుక్రింద మఱేముందో? ఆలా తొంగి చూసింది. ఇలా వంగి చూసింది. "మాంవా!" అని తిరిగి కేకేసింది. మాంవకు బదులు ఆకాశం ప్రతిధ్వనిగా "మాంవా!" అని తన కవల సోదరి అన్నట్టయింది. అదే ప్రత్యుత్తరమా? మఱి జాడలేదు జవాబు లేదు మాంవ మాయటీ దయ్యాడా అని ఏనుగు పైపై కెగిసి ఎగిసి ఆ పసుచు చూచింది గాని, ఎవరూ కనిపించలేదు.

బుట్టెడు వుండ్రాళ్లు ఏనుగునోట్లో పోసి—"మాంవా! నీపని నేటితో ఇలా మట్టం అవుతుందని అనుకోలేదు నీవిలా మన్ను పాలవుతావని అనుకోలేదు." అంటూ శోకం తీయసాగింది. ఏనుగు బుట్టెడు వుండ్రాళ్ళు తినేసి ఘీంకరించి లేచి చక్కాపోయింది సంజ వెన్నెల్లో.

కాని కబోదు బిచ్చగాని కళేబరంకోసం ఆకాడ పడిపోయిన చెట్టుయొక్క పసుగు పేక కొమ్మల క్రింద రెమ్మల క్రింద నెమకే వారెవరు? తిరిపెకత్తె వొక్కర్తుకా ఒక గడియ ఆ ఆకు అలము తప్పించి తనకు తన "మాంవ" కనిపిస్తాడేమోనని అటుమటించి వెసుకుతూ అరచింది. కాని లాభం లేకపోయింది. ఏనుగు తోటి కూడా పోనైతినే అని అనుకుంది. కాని అది తనతో రానిచ్చేటట్టులేదే! అని రిచ్చపోయింది. "ఏనుగే మాంవ మాంవే ఏనుగు అయి వుండాలి." అని అందటితోను ఆ కబోదు బిచ్చగాని మహదాశయాన్ని వెల్లడి చేస్తూ ప్రతీ వినాయకుడి చవితికీ ఒక పెద్ద అట్ట వినాయకుణ్ణిచేసి అక్కడే—ఆ చెట్టు పడి పోయి కబోదు బిచ్చగాడు చనిపోయి, రెండూ కూడా కలగలపుగా తగలపెట్టబడ్డ ఆ ఖాళీ స్థలంలో ఉంచి, ఆ త్రప్పుడు ఆ అట్ట పొట్టలో తాను పండుకుని నిద్రిస్తూ కబ్బమప్పుడు "ఉండ్రాళ్లెట్టండి మా వినాయకున"కంటూ అడుక్కుని ఆ అంగన అధిగమించింది.

దేవతారాధనలో ఒక దివ్యధామము తన కబ్బినట్టు సంతోషించింది. చెట్టునంటే, చెట్టునంటెట్టుకున్న మనిషినంటే, ఏనుగు రూపుమాప కలిగింది కాని ఆ అట్ట వినాయకుడి పొట్ట కొక్కుల్లా అణచలేకపోయారు. మణచలేకపోయారు.

క్రమంగా దాన్ని ప్రజలు సిమెంటు వినాయకునిగా తయారు చేశారు. దాని లోపల తిరిపెకత్తె వాసం చేసేలాగు ఖాళీ వుంచి వెనకాల ఒక దర్వాజా పెట్టేరు. ఎదురునుంచి ఉండ్రాళ్లు మెక్కేలా నోరు చూపించారు. ఈ వింత ఘంస్వరూపం కన్న కామధేనువా కారంకన్నా లోకానికి ఆశ్చర్యం గొల్పింది అందులోనూ తిరిపెకత్తె వెనక వెంపునుంచి వెలికివచ్చి, ముందుకు చేరి ప్రతీ వినాయకచవితి పండక్కి ఆ సిమెంటు వినాయకుడికి బొట్టెట్టి అందగిస్తూవుంటే లోకానికి చూడముచ్చటేసింది. ★



# బొమ్మల పెళ్ళి

శ్రీ కె. క్రిష్ణమూర్తి

చిట్టి పొట్టి
కూతురి పెళ్ళంట.

చిట్టెమ్మకూతురు చక్కనమ్మ,
పొట్టెమ్మసూనుడు చక్కనయ్య.
ఇద్దరికీ జత కుదిరిందీ,
ఢంఢన, బాజా మోగిందీ,
పెళ్లికి అందరు వచ్చారూ,
కానుక లెన్నియొ తెచ్చారూ.

"పెద్దలంత దయచేయండి,
కూర్చోండటు; కానీయండి.
మంగళస్నానము లవశ్యం
మరేమి టింకా ఆలస్యం?
ఏమండో పురోహితుడుగారు
అల్లా చూస్తే ఎల్లా మీరు?"
"ఆఁ ఆఁ టైమయిపోతూంది,
ముహూర్తం దాటిపోతూంది"

"కూర్చోవయ్యా అల్లాగా
అంత సిగ్గైతే ఎల్లాగ?"

"కాస్త తలొంచు మాయమ్మా
కూతురికి చేర్పవే చిట్టెమ్మా"
బాజా భజంత్రీలు వాయించండి
బాగా 'ఢమఢమ' మోగించండి

మంగళసూత్రం కట్టారూ,
మంగళహారతి పాడారు,
వేడుకలన్నియు చేశారు
కడుపారా భోంచేశారు.

చిట్టీ! చిట్టీ! చిట్టెమ్మా
పొట్టీ! పొట్టీ! పొట్టెమ్మా
అదుగో అదుగో అమ్మపిలుప్
అందరు పిల్లలుమరి గప్‌చిప్

# బాలభారతీ సంఘం

(మా విజయవాడ విలేఖరి)

ప్రతిదేశంలోనూ అంతా బాగా ఉండటానికి, ఎక్కువ ఆరోగ్యంగా ఉండటానికి, మంచి ఇళ్లు కట్టుకోటానికి, వస్తువులన్నీ చౌకగా దొరకటానికి, ఏమేమి చేయాలో ప్రభుత్వాలు తేల్చుకుంటారు. ఏఏ పనులు ఎప్పుడెప్పుడు ఎట్లా చేయాలో ముందే వ్రాసిపెట్టుకుంటారు. ఈ వ్రాసిపెట్టుకున్నదాన్ని "అభివృద్ధి ప్రణాళిక" అంటారు. కొన్ని దేశాల్లో చిన్నపిల్లలకు ఆడుకోటానికి చోటుచూపించటం, ఆడుకునే వస్తువుల్ని ఇవ్వటం, చక్కటి తిండి పెట్టటం, ఆరోగ్యంగా ఉండేటట్లు చూడటం-ఎలా చేయాలో కూడా ఈ ప్రణాళికలో ఉంటుంది. మన దేశంలో చూడండి. చదువుకునే ఈడులో ఉన్న పిల్లలు చాలామంది, చదువుకోకుండా తిరుగుతూ ఉంటారు. దొంగతనాలు చేస్తూ ఉంటారు-చిలిపి పనులు చేస్తూ ఉంటారు. వాళ్ల తల్లిదండ్రులు ఏవో పన్లు చేసుకుంటూ, ఈపిల్లల విషయం పట్టించుకోరు. ఈపిల్లలకు చదువు చెప్పించటానికి, తల్లితండ్రుల దగ్గర డబ్బు ఉండదు. మరి - ఈపిల్లలంతా ఇట్లా చెడిపోవలసిందేనా? కొందరు బీదపిల్లలు-అంత చిన్నవయసులోనే ఏదో కూలిపని చేసుకుంటూ ఉంటారు- కొందరు అడుక్కుంటూ ఉంటారు. వీళ్లందరికీ తిండి గుడ్డ ఇచ్చి చదువు చెప్పించే వాళ్లెవ్వరు? ప్రభుత్వం చెప్పించలేదట. కాని విజయవాడ బాలభారతి సంఘంవారు పిల్లలందరికీ చదువు చెప్పించాలని, వాళ్లకి ఆడుకోటానికి, పాడుకోటానికి ఏర్పాట్లు చేయాలని అంటున్నారు.

(27-వ పేజీ చూడండి)



వర్నర్ శ్రీ కృష్ణకుమార్ సింహ్జీ విజయవాడ వచ్చినపుడు బాలభారతి సభ్యులు మొగలితుర్రు బుర్రకథ చెప్పారు. చి॥ సత్యనారాయణమూర్తి, ఏడిద కామేశ్వరరావు, చి॥ గిరిజ, శ్రీ కృష్ణకుమార్ సింహ్జీ, చి॥ దుర్గ

# ముంగిస పామునెల్లా చంపుతుంది?

★

సృష్టిలో కొన్ని కొన్ని జంతువులకు బద్ధశత్రుత్వం ఉన్నట్లు మనకు వాడుకగా ఒకనమ్మకం వున్నది. సమానమైన బలశౌర్యాలుగల జంతువులకే సాధారణంగా ఈశత్రుత్వం అంటగడతాము. ఉదాహరణకు సింహాన్ని, ఏనుగును తీసుకోవచ్చును. ఈ రెండూ ఒకదానినొకటి శౌర్యంలో ఏమాత్రం తీసిపోవు. అల్లాగే ముంగిస, పాము కూడాను. ఈ రెంటికీ పోట్లాటవస్తే ముంగిసే ఎప్పుడూ జయిస్తుంది. పాము ముంగిసను చంపటం మనమెప్పుడూ వినలేదు. నిజానికి పాముగనక గురి తప్పకుండా కాటువేస్తే అన్ని జంతువులకు మాదిరిగానే ముంగిసకూడా దెబ్బకి చచ్చిపోతుంది. అయితే పాము గురిని తప్పించుకోవటంలోనే ఉంది ముంగిస గొప్పతనమంతా.

"కంట్రీమన్" అనే ఇంగ్లీషు పత్రికలో డి. బి. జె. మక్‌టర్క్ అనే ఆయన తనుకళ్లారా చూసిన విషయాన్ని ఇలా వర్ణించాడు:

"హోల్కార్ కొండల్లో ఒక గొప్పపాము వేటకాడున్నాడు. ఆయన నాకు స్నేహితుడు. 'తాచుపాము, ముంగిస దెబ్బలాడుకోవడం మీరెప్పుడైనా చూశారా' అని ఆయన్ని నేనడిగాను. "ఎప్పుడూ చూడలే" దన్నాడు ఆయన. 'అలాంటి దెబ్బలాట ఏర్పాటు చెయ్యగలరా' అని నేనడిగాను. 'నాకు పాములు స్నేహితులవంటివి. వాటిని అంత చిత్రవధకి అప్పగించడం నాకిష్టంలేదు,' అన్నాడాయన. నేను బలవంతపెట్టాను. చివరికాయన ఒప్పుకున్నాడు.

రెండుమూడు రోజుల్లో ఆయన ఒక తాచుపామును, ముంగిసను కూడా వేటాడి పట్టుకున్నాడు. నిలువు లోతుగల గోతిని తవ్వించాడు. అది ఇరవైఅడుగుల వెడల్పున్నది; దాంట్లో పొడిఇసుక దట్టంగా చల్లబడింది. అందులో ఆయన తాచుపామును వదిలి పెట్టాడు. ఆపాము చాలపెద్దది. దాదాపు నాలుగడుగుల పొడుగుండవచ్చును. అది వదిలిపెట్టగానే చుట్టలు చుట్టుకుని పడుకుంది. తరవాత ముంగిసను వదిలిపెట్టాము. అది పాముతో తనకేమీ సంబంధంలేనట్లు ఒకమూలకుపోయి కూర్చుని వీపు గోక్కుంటోంది.

ముంగిసను చూడగానే తాచుపాము తలఎత్తింది. పడగ చాల ఎత్తున లేచింది. మాకు బాగా వినిపించలేదుగాని బుసకూడా కొట్టినట్లుంది. ఎందుకంటే ముంగిస "ఏమిటీచప్పుడు" అన్నట్లు వెనక్కు తిరిగి పామును చూసింది. చూడగానే దానిరోమాలు నిక్కబొడిచాయి. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ ఠీవిగా, గంభీరంగా, పామును సమీపించింది. ఒకగజం దూరంలో ఆగి మళ్లీ కూర్చుంది. కోపంతో దాని కళ్లు కూడా ఎర్రబడ్డాయి.

ముందు దెబ్బతీసిందిపామే. కాని అది ఎప్పుడు కదిలిందో, ఎప్పుడు దెబ్బకొట్టిందో, ఎప్పుడు మళ్లీ మామూలు చోటుకివచ్చి కూర్చుందీ మాకు కనిపించనేలేదు. అంతా కన్నుమూసి తెరిచేలోగా జరిగిపోయింది. పదిసెకండ్లు ఆగి మళ్లీ కొట్టింది. ఈసారిఅది కదలటం కని

పించింది, కాని దెబ్బకొట్టటం కనిపించలేదు. అంత వేగంగా కొడుతుందిపాము. ఈసారి బలంగా కొట్టినట్లుందిగావును, నేలమీద గుంట కూడా పడింది.

ముంగిస మాత్రం నిర్లక్ష్యంగా దెబ్బ కొట్టినప్పుడల్లా కొంచెం పక్కకు జరగటం తప్ప ఇంకేం చేయలేదు. కాని ఒకకంటితో జాగ్రత్తగా పామును గమనిస్తూనేవున్నది. పాము పడగఎత్తి, జర్రునవచ్చి, దెబ్బకొట్టే క్షణందాకా ముంగిస కదలకపోవటం మాకాశ్చర్యం కలిగించింది. దానికసలు పాముతో దెబ్బలాడాలనే వుద్దేశ్యమే లేనట్లనిపించిది.

ఇలాగ పదినిమిషాలసేపు ఏకపక్షయుద్ధం జరిగింది. తాచుపాము ఎన్నిసార్లు దెబ్బకొట్టిందో చెప్పలేము. ముంగిస చెక్కు చెదరలేదు. పాముకు మాత్రం ఆయాసం ఎక్కువైంది. ఇక కదలలేక చాచుకుని పడుకుంది. ముంగిసదాన్ని ఊరికే పడుకోనిస్తుందా? పాము చుట్టూరా ప్రదక్షిణం చేస్తోంది, వెనక పాటున మీదపడదామని. హఠాత్తుగా పాము తోకను పట్టుకుకరిచి, మళ్లీ దూరంగాపోయింది. పాముకు పౌరుషంవచ్చి పడగఎత్తిబుసలుకొట్టింది. యుద్ధం తిరిగి ప్రారంభమైంది.

తాచుపాము బలం క్షీణించిపోతోంది. ఇదివరకంత బలంగా కొట్టలేక పోతోంది. అసలు కదలటానికి ఓపిక తగ్గిపోయింది. ముంగిస మాత్రం, పూర్వపు పద్ధతినే అవలంబిస్తోంది: ఇటు దెబ్బకొడితే అటు వొత్తిగిలటం, అటుకొడితే ఇటు జరగటం అంతే. పదినిమిషాలయ్యేసరికి పాముపని పూర్తిగా అయిపోయింది. ఇంకా ఉత్సాహంగా, చురుగ్గా, బలంగానే ఉన్న ముంగిస అవలీలగా తాచుపామును మెడమీద కరిచింది. ఊహు. పాము కదల్లేదు, "ఏమిటా కదలదు?" అని మళ్ళీ కరిచింది. ఊహు. అంతే. పాముకు స్మృతి తప్పిపోయింది. ముంగిస రెండు నిమిషాలసేపు చూసింది పాముకు స్మృతి వస్తుందేమోనని. చివరకు విసుగుపుట్టి పాముమెడకొరికి ఇవతల పారవేసింది. ★

# బాలభారతి సంఘం

(25-వ పేజీ తరువాయి)

అల్లరి చిల్లరగా తిరుగుతున్న పిల్లలను ప్రభుత్వవారు జైల్లోపెడ్తారు. కొందరు పిల్లలకు తల్లిదండ్రులు తిండి పెట్టలేరు-ఇంక చదువెట్లా చెప్పించగలరు? కొందరు తల్లితండ్రులు తమ ఖర్చులు తగ్గించుకొనైనా సరే, పిల్లలకు చేతనైనంతలో మంచి గుడ్డలిచ్చి బడికి పంపిస్తూ ఉంటారు. మీరు చూసే ఉంటారు - స్కూళ్ల దగ్గర పకోడీలు, కారపుశనగలు మురుకులు ఐస్క్రీం, వేరుశనగ కాయలు-ఇంకా ఏవేవో అమ్ముతూ ఉంటారు. వాటిపైన దుమ్ముపడి ఉంటుంది-వాటిపైన ఈగలు ముసురుతూ ఉంటాయి-వాటిని పరిశుభ్రంగా తయారు చేయరు. కానీ డబ్బుఉన్న పిల్లలు వాటిని కొనుక్కొని తిని, తర్వాత జబ్బుపడ్తారు. మరి పిల్లలు బాగా ఉండటం ఎట్లా?

విజయవాడలో బాలభారతి అనే పిల్లలసంఘాన్ని అన్నయ్య ఏడిద కామేశ్వరరావుఅనే ఆయన పెట్టాడు. అందులో పిల్లలు పాడుకుంటూ మాట్లాడుకుంటూ, కాలక్షేపం చేస్తూ ఉంటారు. ఆడుకోటానికి చోటులేదు- సంఘం ఉండేటందుకు ఇల్లులేదు-చదువుకునేటందుకు పుస్తకాలులేవు. ఏపని చేయాలన్నా డబ్బులేదు. అయినా చక్కగా పాడతారు-నాటకాలు వేస్తారు. మొన్నీమధ్య మద్రాసు గవర్నర్‌గారు, వారిభార్య వచ్చినప్పుడు చక్కగా "మొగలితుర్రు చరిత్ర" బుర్రకథ చెప్పారు. ఆతర్వాత మంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు, బాలభారతికి యేభైరూపాయలు ఇచ్చారు. పిల్లలంతా ఇలాగే ప్రతిఊళ్లోనూ సంఘాలు పెట్టుకొని, ఆడుకోండి-పాడుకోండి-పరిశుభ్రంగా ఉండండి-బీదపిల్లలకుకూడా ఇలాటిసౌకర్యాలు కలగాలని దేవుణ్ణి ప్రార్థించండి. ★

# డిటెక్టివ్ ప్రాపిష్టి

## “రేడియమ్”

ఆ రోజు శనివారం. ప్రైవేటుకు వెళ్ళిన డాక్టరుగారి చిన్నమ్మాయి చిట్టి గబగబావచ్చి పుస్తకాలను కిటికీలో పడవేసి “అమ్మా అన్నంపెట్టు. ఆకలవుతోంది” అన్నది. అమ్మగాని అక్కయ్యగాని విన్పించుకునేట్లు లేరు. వాళ్ళ సంభాషణలో వాళ్ళున్నారు. అక్కకు దసరా శలవులు పదిరోజులే యిచ్చారు. మళ్ళీ రేపు విశాఖపట్నం వెళ్ళిపోతుంది. అక్క వెళ్ళిపోతుంటే చిట్టికి విచారమూ, సంతోషమూ రెండూను. అక్క వెళ్ళేప్పుడు బండిలో బస్సుస్టాండువరకూ వెళ్ళవచ్చును, అంతేకాక ప్రతిసారి వెళ్ళేప్పుడూ అక్క రూపాయి యిస్తుంది. అది పెట్టి రత్తయ్యకొట్లో బోలెడు శనగపప్పూ, మరమరాలూ కొనుక్కోవచ్చును. ఇన్ని లాభాలున్నా, అక్క యింకా కొన్ని రోజులుంటేనే బాగుంటుందని చిట్టివుద్దేశ్యం. శలవులన్నీ అయిపోతే మాత్రం యింకో వారంరోజులుండకూడదూ. సుబ్బారావు మాస్టరుకు మల్లే వాళ్ళమేష్టరు కొడతాడేమో. అంతే అయివుంటుంది. లేకపోతే అక్కకు అంత తొందరెందుకు? యూనివర్సిటీలోకూడా బడికి రాకపోతే మేష్టర్లు కొడతారా? యేమో?

“ఆ డాక్టరును పెండ్లిచేసుకోననడంలో నీ వుద్దేశ్యమేమిటే” అంటోంది అమ్మ. “ఆస్తిలేనివాళ్ళను యెలా చేసుకోమంటావమ్మా” అన్నది అక్క.

“వచ్చిన వాళ్ళందరికీ ఆస్తిలేదనీ, అందంలేదనీ వంకలు పెడుతుంటే యెలాగే” అన్నది అమ్మ. అక్క యేమీ మాట్లాడలేదు. చిట్టి యెన్నో బొమ్మల పెళ్ళిళ్ళు చేసింది కాని ఒక్క బొమ్మకూడా పెళ్ళివద్దన లేదు. అక్క యెందుకు వద్దంటుందో! పెళ్ళంటె యెంత సరదాగానో వుంటుంది. బోలెడు చీరలూ, జిలేబీలూ, జాకెట్లూ, భజంత్రీలూ, కారప్పూసా, యింకా యెన్నో వస్తాయి. అక్కకు మరెందువలన యిష్టం లేదు? కారప్పూసంటే అక్కకూ యిష్టమేనేమరి! ఇందూ వాళ్ళక్క కూడా అంతే. రేపు వెళ్ళనగా యివాళ ఆత్మహత్య చేసుకున్నదిట. ఆత్మహత్యంటె చనిపోవడమని చెప్పిందిఅక్క. అక్కయ్యకూడా చచ్చిపోతుందా? యేమో!

తను తీసుకు వెళ్ళే పచ్చళ్ళు పెట్టుకోవడానికని అక్క గంధకపు సీసాలు తీసింది. వాటినిండా గంధకం అంటుకొని వున్నది. ఆ గంధకం పోగొట్టి సీసాలు శుభ్రం చేయడానికి కూర్చుంది అక్క. చిట్టి గబగబా అన్నంతినేసి వెళ్ళి అక్కదగ్గర కూర్చుంది. యెంతసేపు తోమినా గంధకం వదిలేట్లుగా లేదు. వేడినీళ్ళు పోసి కడిగారు, గుడ్డలుపెట్టి తుడిచారు యింకాపోలేదు. సీసాల అడుగున కొద్దిగా అతుక్కునివున్నది. అక్కకు విసుగు పుట్టిందిగాబోలు, “సీసాలవిషయం సాయంత్రచూద్దాంలే” అన్నది. సాయంత్రం యెందుకూ? గంధకం సాయంత్రమయితేనే పోతుందా? ప్రొద్దున అయితే పోదా? యేమో!

అక్కా చెల్లెల్లిద్దరూ వెళ్ళిమందుల బీరువాలుండే హాల్లోకూర్చున్నారు. చిట్టికెప్పుడూ ఆమందులన్నీ యెలా వుంటాయో తెలుసుకోవాలని కోరికగా వుంటుంది. అన్ని మందులూ తేనెకి మల్లే తియ్యగావుంటే యెంత బాగుండును! కాని కొన్నిమందులు భలే చేదుగా వుంటాయి. చేదుమందులంటే చిట్టికి అసలు యిష్టమేలేదు. తియ్యామందు

లంటే కొండంత యిష్టం. ఆ బీరువాలలో తియ్యమందులన్నీ ఒక దాన్లోనూ చేదు మందులన్నీ ఒక దాన్లోనూ వుంటాయి గాబోలు. ఆ బీరువాల మీద పేర్లుగూడా వున్నాయి. "అక్కా ఆబీరువామీద వ్రాసివున్న దేమిటి?" అని ప్రశ్నించిందిచిట్టి. "పాయిజన్స్ అంటే విషాలన్నమాట. విషం త్రాగితే చనిపోతారు" అనిచెప్పింది అక్క. "చనిపోవడమంటే యేమి" టన్నది చిట్టి "చనిపోవడమంటే, వాళ్ళు నిద్రపోతున్నట్లుగా వుంటారు. ఎంత పిలిచినా మాట్లాడరు." అనిచెప్పింది అక్క. "నీవుచనిపోతే నాతోగూడా మాట్లాడవా? నాన్నపిలిచినా పలుకవా? యేడ్చినా మాట్లాడవా?" అన్నది చిట్టి. "ఊహు. మాట్లాడను. నీ ఇటాగే పిచ్చిప్రశ్నలు వేస్తుంటే నిజంగానే చచ్చిపోతాను" అన్నది అక్క.

అప్పటినుండి చిట్టికి తగని భయం పట్టుకుంది. తను యే ప్రశ్న వేస్తే ఒక అక్కకు కోపంవచ్చి చనిపోతుందో. చచ్చిపోయినా మాట్లాడితే ఫరవా లేదుగాని, మాట్లాడకపోతే యెలా? ఆ. పెద్దగా యిల్లెగిరిపోయేలా యేడిస్తే కోపంవచ్చి అయినా మాట్లాడదా? ఊరుకో మనయినా చెప్పదా? "గోల చెయ్యవద్దు. నేను చనిపోయాను" అనయినా అనదూ? అసలు ప్రశ్నలు వెయ్యకుండా వుంటే చచ్చిపోకుండా వుంటుందా? యేమో! పెండ్లిమీద కోపంవచ్చి చనిపోవచ్చునుగా. ఇందూ వాళ్ళక్క చచ్చిపోలేదూ, అలాగే. అక్క విషాలబీరువా తెరుస్తుందేమో చూడాలి. నాన్న ఊరికెళ్ళారుగదా అని గబగబా విషం త్రాగి నాతో మాటాడకుండా వుండాలని చూస్తూంది. పాపం! అమ్మ నిద్రబోతున్నది. ఇంట్లో ఎవరిసందడీ లేదు. చిట్టి మాత్రం పెద్దక్క యేంచేస్తుందో చూస్తూ వున్నది. అపుడే మూడుగంటలయిపోయింది. అక్క తాళంచెవులు తీసుకెళ్ళి నెమ్మదిగా విషాలబీరువా తెరిచింది. అందులోనుండి కాఫీరంగు సీసాతీసి చిన్నగది అలమారులో పెట్టి వెళ్ళిపోయింది. ఇంకా నయం, త్రాగలేదు. అక్క వెళ్ళగా లోపల ఆసీసాను తీసుకెళ్ళి కాలువలో పారేస్తే యిహ దిక్కేవుండదు, అనుకున్నదిచిట్టి. ఎవరూ చూడకుండా సీసాను తీసుకుని పరుగెత్తుకుంటూ వెళ్ళి కాలువలో పారవేసి వచ్చింది. ఏమీ యెరుగని నంగనాచిలా పడుకుని నిద్రబోయింది.

సాయంత్రం మయూక గంధకపు సీసాలు శుభ్రం చెయ్యడానికి పూనుకున్నారు అక్కా, చిట్టీను. "ఇప్పుడేంచేస్తే గంధకంపోతుంది?" అని అడిగిందిచిట్టి. "కొంచెం నైట్రిక్ ఆసిడ్ వేసి కడిగితే పోతుంది." అని చెప్పింది అక్క. "అది యెక్కడుంటుంది" అని ప్రశ్నించింది చిట్టి. "మధ్యాహ్నం బీరువాలోనుండి తీసి చిన్నగది అలమారులో పెట్టాను. తీసుకరా" అన్నదిఅక్క. చిట్టి వెళ్ళి యెంతకూ రాకపోయేసరికి అక్కకు భయమేసింది ఆసీసాలోనిది మీద పోసుకుని కాల్చుకోలేదుగదా అని. పరుగెత్తుకుంటూ వెళ్ళి చూస్తే యేముందీ-చిట్టి గదిలో మూలగా కూర్చుండి యేడుస్తూవుంది. "ఆసిడ్ మీద పోసుకున్నావా యేమే..." అని ఆతురతగా ప్రశ్నించింది అక్క. చిట్టి యేడుస్తూ జరిగినదంతా చెప్పింది. అంత విలువగలసీసా పోతేపోయింది గాని చిట్టిచేసిన తమాషాకు అంతా నవ్వుకున్నారు. రాత్రి నాన్నగారు రాగానేచెప్తే నాన్నగారు కూడా నవ్వారు.... 

# మాటకుమాట

"సూర్యశ్రీ"

ఒకవూళ్లో రంగయ్యఅనే రైతు వుండేవాడు. రంగయ్య బాగా చదువుకున్న వాడే అయినా ఏ వుద్యోగమూ చేయక తనకున్న పదిఎకరాల పొలంలో స్వంత వ్యవసాయం చేసుకుంటూ సుఖంగా జీవిస్తున్నాడు.

ఒకవైపు పొలంపనులు చూసుకుంటూనే, తీరికసమయం లభించినప్పుడల్లా ఏదో వొక మంచి పుస్తకం చదువుకోవటమంటే ఎంతో సరదా రంగయ్యకు. అందువల్ల సామాన్యంగా ఆ వూళ్లోని గ్రంథాలయంలో నుండి మంచి మంచి గ్రంథాలు తెచ్చుకొని చదువుకుంటూ వుండేవాడు.

రంగయ్యయింటికి దగ్గరలోనే గోపయ్య అనే పంతు లున్నాడు. గోపయ్యకూడా బాగా తెలుగు చదువుకున్నవాడు. ప్రయివేటు బడి పెట్టి సుఖంగా జీవనం సాగిస్తున్నాడు. గోపయ్యదగ్గర భారత భాగవతాది గ్రంథాలెన్నో వున్నాయి. ఆసంగతి రంగయ్యకు తెలిసింది.

ఒకనాడు రంగయ్య, గోపయ్య యింటికి వెళ్ళి "పోతనగారి భాగవతం ఒకసారి యివ్వండి. చదువుకొని యిస్తాను" అని అడిగాడు.

గోపయ్య చిరునవ్వు నవ్వి "అలాగే యిస్తాను. కాని పుస్తకాన్ని మీయింటికి తీసుకుపోతే మీ పిల్లలు పసితనంచేత చింపివేయవచ్చు. అందువల్ల మీరు మాయింట్లోనే కూర్చొని చదువుకునేటట్లయితే పుస్తకాన్ని యివ్వటానికి నాకేమీ అభ్యంతరం లేదు" అని ఒక చిన్న వుపన్యాసం యిచ్చాడు.

ఆమాటలు విని చిన్నవుచ్చుకొని, మారుమాట మాట్లాడకుండా యింటికి వచ్చాడు రంగయ్య.

కొన్నాళ్ళు గడిచిపోయినాయి. వర్ష ఋతువు సమీపిస్తుండటం చేత అంతా బీర, బెండ మొదలైన పాదులు పెట్టుకోసాగారు. గోపయ్యకూ పెద్ద దొడ్డి వుంది. ఎడారిలా వూరికే వుంటే ఏమి లాభం గనుక తానుకూడా దొడ్డినిండా పాదులు పెట్టుకుంటే మంచి దనుకొన్నాడు గోపయ్య.

అంతా బాగానే వుంది. పాదులు చేయాలంటే పలుగు, పార కావాలి గదా! అసలు పనిముట్లు అవే లేవు, గోపయ్య దగ్గర.

గబగబా రంగయ్యయింటికి వెళ్ళి "మీ పార, పలుగు ఒకసారి యివ్వండి. మాదొడ్లో పాదులు చేసుకొని తొందరగా తీసుకొచ్చి యిస్తాను". అన్నాడు గుక్క తిప్పకోకుండా గోపయ్య.

సమయానికి మంచి ఆలోచన తట్టింది రంగయ్యకు. "అలాగే యిస్తాను. కాని వాటిని మీ యింటికి తీసుకుపోతే, మీపిల్లలు ప్రమాదవశాత్తు వాటిని ఏ కాలిమీదో, చేతిమీదో వేసుకోవచ్చు లేక పారెయ్యవచ్చు. అందువల్ల మీరు మాదొడ్లో కూర్చొని పాదులు చేసుకునేటట్లయితే పలుగు, పార యివ్వటానికి నాకేమీ అభ్యంతరం లేదు." అని తడుముకోకుండా సమాధానం చెప్పాడు రంగయ్య.

ఆ మాటలు విని తెల్లబోయి, మారుమాట మాట్లాడకుండా, సిగ్గున తల వంచుకొని యింటికి వచ్చాడు గోపయ్య.



# పాఠకుల అభిప్రాయాలు

(కేవలం ప్రశంసలే పంపినందువల్ల ప్రయోజనం లేదనీ, తమ అభిప్రాయాలను స్పష్టంగా, నిర్భయంగా, సమర్థకంగా వ్రాయవలసిందనీ లేఖకులకు మా ప్రార్థన
—సంపాదకుడు)

---

మహాశయా,

తెలుగు పాఠకలోకంలో విశేషంగా ప్రజాదరణ పొందుతున్న మీ పత్రికలో మెచ్చుకోదగిన విషయం ఏమంటే— 1. సినిమా శీర్షిక 2. కాంచనద్వీపం అనే కథ 3. మిగతా కథలు, విశేషాలు అన్నీ ఒక ఎత్తు. ఇందులో అన్నిరకాల పాఠకులను పరిపజేసే విశేషాలున్నాయి. ముఖ్యంగా మెచ్చుకోదగ్గ విషయం......సినిమా శీర్షిక. ఎంతోకాలంగా సినిమాపరిశ్రమలో పని చేస్తున్న వ్యక్తికూడా తెలియబుచ్చలేనటువంటి అనేక విషయాలను వ్రాస్తున్నారు సినిమా విషయాలు వ్రాస్తున్నవారు ఇంతటి అనుభవం ఎన్నాళ్ళనుంచి సేకరించియున్నారో!

తెనాలి 7-11-51 } మండవ శ్రీనివాసరావు చౌదరి.

---

ఆర్యా,

శ్రీ యం. సీతారామయ్యగారు వ్రాసిన "అబ్బాయి చదువు" అనే కథానిక (7-11-51) చాల బాగుంది. నండూరివారి "కాంచన ద్వీపం" "రాజా—పేదా" అంత రసవత్తరంగా లేదని చెప్పవలసి వస్తుంది.

ఒక పార్టీని పొగుడుతూ ఇంకొక రాజకీయ పార్టీని విమర్శించటం పత్రికయొక్క ఆదర్శానికి చాలా దెబ్బ అనుకుంటాను. పార్టీలను గురించి వ్రాసేటప్పుడు నిష్పక్షపాతంగా అన్ని పార్టీలను విమర్శిస్తే బాగుండునని తెలుస్తాను.

విజయవాడ. 8-11-51 } కె. సాంబశివరావు,

---

[వారపత్రిక పూర్వ సంపుటాలను తిరగవేసి రాజకీయ వ్యాసాలను గమనించినట్లయితే ఏపార్టీపట్లనూ మేము పక్షపాతం వహించలేదని బోధపడుతుంది.
—సంపాదకుడు.]

---

ఆర్యా,

...మంచి మంచి కథలతో పాఠకులను ఆనందింపచేయు పత్రిక దీనికంటే వేరే లేదేమో అనిపిస్తుంది. బొమ్మరిల్లులో మీరు వేసే సీరియల్ పిల్లలను చాలా ఆకర్షిస్తుంది. ఈ మధ్య సిండరిల్లా కార్టూన్ చిత్ర కథ అమోఘంగా ప్రచురించుకుంటూ వచ్చారు. కొత్తగా మొదలుపెట్టిన, జంతువులు — పక్షులు పిల్లలకు చాలా విజ్ఞానము కలిగించునటంలో సంశయము లేదు. మీ పత్రిక అన్నిటికీ ప్రాముఖ్యమిస్తుంది: సినిమావార్తలకు, బాలానందమునకు, రాజకీయాలకు, చక్కని కథలకు ఇంకా ఎక్కువ పేజీలతో కౌంట్ ఆఫ్ మాంటె క్రిస్టో ప్రచురిస్తూవస్తే చాలా బాగుంటుందని నా అభిప్రాయము. చక్కని శైలిలో కౌంట్ ఆఫ్ మాంటె క్రిస్టో అనువదిస్తూ వస్తున్న నూరంపూడి సీతారామ్ గారు చాలా అభినందనీయులు.

కర్నూల్ 7-11-51 } కె॥ నిర్మల

---

ఆర్యా,

శ్రీ 'ప్రమ' గారు వ్రాసిన "జీవితరేఖ" (17,24,31-10-51) చాలా వాస్తవికంగా, చక్కగా వుంది. సాధారణంగా మన కుటుంబాలలో జరిగే సంఘటనలలో 'జీవితరేఖ' కథాభాగం వొకటి. సరసమైన శైలిలో యీ కథాభాగాన్ని చిత్రించిన 'ప్రమ' (స్త్రీ రచయితో పురుష రచయితో తెలియకుండా వుంది పేరు!) గారికి నా ధన్యవాదాలు.

సంపాదకులకు ఒక్క చిన్న సూచన. యిదివరలో రేడియోలో ప్రసారితమైన చిన్న నాటికలు (పావు గంటవి) మీ పత్రికలో ప్రచురిస్తే బాగుంటుంది. ప్రతివారం మీ సంచికలో ఒక చిన్న నాటిక కూడా వుంటే చాలా రమ్యంగా వుంటుంది.

విశాఖపట్నము 8-11-51 } వి. జి. వసంతకుమార్.

---

ఆర్యా!

ప్రతివారము ఆంధ్రపత్రికలో వెలువడు కథానికలు, సీరియల్సు, బొమ్మరిల్లు ఆంధ్ర ప్రజానీకానికి విజ్ఞానాన్ని, వినోదాన్ని సమకూర్చుచున్నవని, నిస్సందేహంగా చెప్పవచ్చును. ఈనాడు వెలువడు తెలుగు పత్రికలలో ఆంధ్రపత్రిక, ఆంధ్రులకు ఏకైక ప్రాతినిధ్యము వహించుచున్నది. రాష్ట్రవార్తలు విడిగా ఒక "కాలమ్"లో ప్రచురించిన బాగుండునని నా యుద్దేశ్యము.

చెన్నపురము 8-11-1951 } బుర్రా శ్రీరామచంద్రమూర్తి.

---

మహాశయా,

ఎప్పుడెప్పుడు బుధవారం వస్తుందా అని ఎదురుచూచే పాఠకులకు మీరు ప్రచురించే కథలు హృదయానందం ఇస్తాయి. మీ సంపాదకీయములను చదివి ఆనందిస్తూ పంపుతున్న నా హృదయాభినందనలు. 31-10-51 న వెలువడిన ఆంధ్రపత్రికలోని శ్రీ సింగరాజు లింగమూర్తిగారు వ్రాసిన 'తెగిన తోకా' అన్న కథ చాలా బాగుంది. బొమ్మరిల్లు బాగుంది.

నెల్లూరు, 8-11-51 } డి. వి. సుందరరావు,

---

ఆర్యా,

.....శ్రీ నూరంపూడి సీతారామ్ గారి అనువాదము "కౌంట్ ఆఫ్ మాంటె క్రిస్టో" చాల రసవంతముగా వుంటోంది. ఇక పిల్లలకు "బొమ్మరిల్లు" శీర్షిక చూచుటకు యింపుగా వుంటోంది. "జంతువులు—పక్షులు" వాటి ఛాయాచిత్రములు చాల ముచ్చటగా వున్నవి...

ఏలూరు. 7-11-51 } భోగరాజు జగన్నాధరావు,

---

# కాంచన ద్వీపం

రాబర్ట్ లూయీ స్టీవెన్సన్



(బొమ్మలు వాల్ట్ డిస్నీ ప్రొడక్షన్స్,
ఆర్. కె. ఓ. రేడియోవారి సౌజన్యంతో)

**జరిగినకథ :**

మాకు బ్రిస్టల్ నగరసమీపంలో ఒక హోటల్ ఉంది. ఒకరోజున మా హోటలుకు 'బిల్' అనే సముద్రపుదొంగ తనతోటి దొంగలనుండి తప్పించుకుని పారిపోయివచ్చాడు. అతడు మా హోటల్లో ఉన్నాడని మిగతా దొంగలకు తెలిసి, అతన్ని చంపేస్తామని బెదిరించారు. అతడు ఆ బెదిరింపుకే భయపడి చనిపోయాడు. అతడు మాకు కొంత డబ్బు బాకీ ఉన్నందున మా అమ్మ, నేను అతనిపెట్టె తెరిచి కొంత డబ్బు, ఒక వింతపార్సిలు తీసుకుని సముద్రపు దొంగలనుండి తప్పించుకుని పక్కగ్రామానికి పారిపోయాము. పార్సిలును మా డాక్టరుగారికి, జమీందారుగారికి చూపాను. దాన్ని తెరిచిచూడగా కాంచనద్వీపపటం కనిపించింది. వెంటనే అక్కడి ధననిక్షేపాలు సంపాదించే ఆశతో అక్కడికి ప్రయాణమయ్యాము. జమీందారుగారొక ఓడను సిద్ధం చేశారు. స్మాలెట్ అనే అతన్ని కెప్టెనుగాను, లాంగ్ జాన్ సిల్వర్ అనే వాణ్ణి వంటవాడుగాను కుదిర్చారు. సిల్వర్ అసలు సముద్రపు దొంగల్లో వాడే అయినందున, మిగతాకళాసులందరితో కలిసి మమ్మల్ని చంపడానికి పెద్దకుట్ర పన్నాడు. ఆకుట్ర నెదుర్కోటానికి మేము ఎదురు సన్నాహాలు చేసుకున్నాం. ఇంతలో కాంచనద్వీపం చేరాము. నేను ద్వీపం చూట్టానికి ఒంటరిగా బయల్దేరాను. ఇక చదవండి.

## 16. డాక్టర్ లివ్‌సే చెప్పిన కథ.

సిల్వర్ మొదలైనవారి బోట్లు రెండూ తీరానికి వెళ్లాక, నేను, కెప్టెను, జమీందారు ఓడగదిలో కూర్చుని మా కార్యక్రమాన్ని గూర్చి చర్చించుకొంటున్నాము. గాలిపాటు ఏమాత్రం అనుకూలంగా వున్నా, ఓడలో మిగిలిన ఆరుగురు తిరుగుబాటుదారులపైన పడి వారిని ఖైదుచెయ్యటమో ఏదో చేసి, లంగరు లెత్తి వెనక్కి బయలుదేరి పోయేవాళ్లం. కాని గాలిపాటు ప్రయాణానికి అనుకూలంగా లేదు. అదీకాక జిమ్‌హాకిన్స్ కూడా కుట్రదారులతోపాటు తీరానికి వెళ్లాడని హంటర్ వచ్చిచెప్పాడు. దాంతో మేము ఏం చెయ్యటానికి తోచక కూర్చుండిపోయాము.

జిమ్ హాకిన్స్ కుట్రదారులతో కలిశాడని మేము ఎన్నడూ అనుమానించలేదు. కాని అతనికే అపాయం వాటిల్లుతుందోనని గాబరాపడ్డాం. సిల్వర్ మొదలైన వారి స్వభావం మాకు తెలుసు గనక, జిమ్ హాకిన్స్ నింక చూడటం అసంభవమని భావించాము. సరంబీ మీదికి వచ్చి చూశాము. గాలి దుర్గంధ భూయిష్ఠంగా వున్నది. కుట్రదారులు ఆరుగురూ ఒకమూల సణుగుతూ, మాకేసి విషపుచూపులుచూస్తూకూర్చున్నారు.

ఊరికే చూస్తూ కూర్చోటం మాకూడా దుర్భరంగావుంది. చివరికి హంటర్, నేనూ కలిసి ఒడ్డుకి వెళ్లి సంగతి సందర్భాలు తెలుసుకురావాలని నిశ్చయించాము. వెంటనే మరొక బోటులో, పటంలో "మట్టికోట" అని గుర్తుపెట్టబడిన ప్రదేశానికి సూటిగా బయల్దేరాము.

ఒడ్డుచేరగానే హంటర్‌ను బోటు కాపాడటానికి వదిలి నేను లోపలికి నడిచాను. చెట్లు, తీగలు అల్లిబిల్లిగా పెరిగివున్నాయి. రెండుచేతుల్లో రెండు పిస్టళ్లు రెడీగా పట్టుకున్నాను. వందగజాలు నడిచానో లేదో "మట్టికోట" కనబడింది. అది మట్టిగోడలతో కట్టబడి వున్నా, గోడలలోపల బలమైన దుంగ లున్నందున ఇల్లు దృఢంగానే వుంది. ఇంటివెనక ఒకమాదిరి ఎత్తైన దిబ్బవున్నది. దిబ్బపైనుండి నీటిబుగ్గ ఒకటి దిగువకు ప్రవహించివస్తోంది. ఆ నీరు నిర్మలంగా, తాగటానికి బాగానే వుండేటట్లున్నది. ఇంటికి, నీటిబుగ్గకు చుట్టూ కొంత ఖాళీస్థలము, దానిచుట్టూ ఆరడుగుల ఎత్తుగల ఒకకంచె ఉన్నాయి. కంచె కవతల మళ్ళీ ఖాళీస్థలముంది. మట్టికోట నెవరైనా ముట్టడిస్తే లోపలివాళ్లు కాలుమీద కాలేసుకుని యుద్ధం చెయ్యవచ్చు. ఎందుకంటే గోడలకు అన్ని వేపులా పెద్ద రంధ్రాలున్నాయి. గోడచాటున నిలబడి, రంధ్రంలో తుపాకు లుంచి, ముట్టడిదారులను కాకుల్ని కొట్టినట్టు కొట్టవచ్చు.

అనువాదం : శ్రీ నండూరి రామమోహనరావు

బయటివాళ్ళు ఖాళీస్థలంలో నుంచునే యుద్ధం చెయ్య వలసి వస్తుందిగనక, వాళ్లకి రక్షణ ఉండనే ఉండదు. ఇంటి లోపల నలభై, యాభైమంది చులాగ్గా పడతారని అంచనా కట్టాను.

కాని అన్నిటికంటే నాకు నచ్చింది నీటిబుగ్గ. తగినంత ఆహారపునిలవలు ఉంటే ఇక్కడ ఎంతకాలమైనా గడపవచ్చు ననిపించింది. ఓడలో మాకు అన్ని సదుపాయాలూ ఉన్నాయిగాని మంచినీళ్లు లేవు. ఇక్కడ పుష్కలమైన జలసౌకర్యం ఉన్నది.

ఇలా ఊహాగానం చేస్తుండగా, నాఆలోచనలను చెదరగొడుతూ పిస్టల్ పేలినధ్వని, "అమ్మో" అని చనిపోతున్నవాడెవడో వేసినకేక వినిపించాయి. అదిరిపడ్డాను. జిమ్‌హాకిన్స్ ఎగిరిపోయివుంటాడని భయపడ్డాను.

ఇంక ఇక్కడ తారట్లాడటం మంచిదికాదని గబగబ బోటుదగ్గరకు వచ్చేశాను. హంటర్ అతి వేగంగా తెడ్లువేశాడు. హిస్పానియోలాలోనికి ఎక్కీ ఎక్కగానే జమీందారు నన్ను కావలించుకున్నాడు. ఇందాకటి పిస్టల్ ధ్వని విని నన్నో,హంటర్‌నో పేల్చేసివుంటారని అతడు భయపడ్డాడట.

కెప్టెన్‌స్మాలెట్ చెప్పాడు:"అక్కడ కూర్చున్న ఆరుగురిలో ఆఖరివాణ్ణి చూశారా? వాడు పిస్టల్ మోత వినగానే మూర్ఛపోయాడు. వాడికి హత్యలు కొత్తగావును.బహుశా వాడు మంచివాడు కావచ్చును. మనవేపు తిరిగితే తిరగవచ్చునుకూడా. ప్రయత్నించి చూద్దాం."

నేను ద్వీపంలో చూసిందంతా చెప్పాను. మేమేమి చెయ్యాలో నిశ్చయించుకున్నాము.

ఓడగదిముందు కావలాగా గ్రేహామ్‌ను నిలబెట్టాము. అతనికి తూటాలునింపిన నాలుగు చిరుతుపాకులిచ్చాము. హంటర్ బోటును ఓడ వెనకభాగాన నిలిపివుంచాడు. నేనూ, జోయిస్ కలిసి బోటులో సామాన్లు నింప నారంభించాము. తుపాకిమందు డబ్బాలు, తుపాకులు, బిస్కట్ల సంచులు, మాంసపు టిన్నులు, ద్రాక్షసీసాలు, అన్నిటికంటే ప్రధానమైనది నా మందులపెట్టె బోటులో చేర్చాము.

మేమీ పని చేస్తుండగా ఈలోగా జమీందారు, కెప్టెన్ సరంబీమీదికివెళ్లి కుట్రదారులను బెదిరించారు. కెప్టెన్ సరంగు ఇజ్రాయెల్ హాండ్స్‌ను పిలిచి ఇలాగన్నాడు: "మిస్టర్ హాండ్స్! మేమిద్దరం ఇక్కడవున్నాం. మా యిద్దరివద్దా చెరి రెండేసి పిస్టళ్లున్నాయి. మీలో ఎవరన్నా ఒడ్డునఉన్న మీ స్నేహితులకు ఏవిధమైన సంజ్ఞగాని చేసినట్లయితే వాడిపని ఆ క్షణంలోనే ఆఖరు. తెలిసిందా?"

ఈ బెదిరింపుకు వాళ్లు భయపడటమే కాకుండా, తెల్లబోయారు. ఎందుకంటే వాళ్ల కుట్రసంగతి మా కింకా తెలియదనే ఉద్దేశపడుతున్నారు. కెప్టెన్ మాటలు విని వారిఆశ్చర్యానికి మేర లేదు. వెంటనే వాళ్లు సరంబీ మెట్లు దిగి కిందభాగానికి వెళ్లారు. బహుశా వెనకనుండివచ్చి మామీద పడదామని వాళ్ల అభిప్రాయంకావచ్చు. కాని ఓడగదిముందు పడవలో తుపాకీలతో రెడీగా ఉన్న గ్రేహామ్‌ను చూసి హడిలిపోయి మళ్ళీ సరంబీమీదికి వచ్చారు. వచ్చి మళ్లీ మొదటచోటే కూర్చున్నారు.

ఈలోగా మాబోటును, సామాన్లతో పూర్తిగా నింపాము. హంటర్, జోయిస్, నేనూ బోటునడుపు

కుని ఒడ్డుచేరాము. ఆ సామానంతా మట్టికోటలో చేర్చాము. జోయిస్‌ను అక్కడ కాపలాపెట్టి హంటర్ నేనూ తిరిగి ఓడలోకి వచ్చి మళ్ళీ ఇదివరకులాగే బోటులో సామాను నింపాము. అదంతా మట్టికోట లోకి చేర్చి, హంటర్‌నుకూడా జోయిస్‌కు తోడుగా వుంచి నేనొక్కణ్ణే బోటులో తిరిగి హిస్పానియోలా వద్దకు వచ్చాను.

మూడోసారికూడా బోటును నింప నారంభించాము. ఈసారి తుపాకిమందు, బిస్కట్ల సంచులు మాత్రమే నింపాము. ఇదే ఒడ్డుకి ఆఖరి ప్రయాణం కనుక బోటులో ఈమాటు నేనూ, కెప్టెన్, జమీందారు, రెడ్రూత్ నలుగురం ఎక్కాలి. నలుగురం ఎక్కగా బోటు ఎంత బరువును భరించగలదో అంత మాత్రమే సామాను చేర్చాము. కాని చూస్తూచూస్తూ ఓడలో అంత మందు గుండు సామగ్రిని వదిలివేయ బుద్ధికాలేదు. అందుచేత కొంచెం ఎక్కువ సామగ్రినే బోటులో నింపామనుకుంటాను. మేము నలుగురం తలొక చిరుతుపాకిని, కత్తిని ధరించాము. మిగతా ఆయుధాలను, మందు సామగ్రిని సముద్రంలో పారబోశాము. రెడ్రూత్ ఓడగదిని విడిచిపెట్టి బోటులోకి వచ్చాడు. నేను, జమీందారుకూడా బోటులో కూర్చున్నాము. కెప్టెన్ మాత్రం ఇంకా నరంబీ మీదనే నిలబడ్డాడు.

"సెయ్ కళాసీలూ! వినిపిస్తోందా నామాట?" అన్నాడు కెప్టెన్.

సమాధానం లేదు.

"నీకే చెప్పేది. అబ్రహాం గ్రే! నీతోనే మాట్లాడుతోంది."

"ఇంకా సమాధానం లేదు. కెప్టెన్ గొంతు హెచ్చించాడు: "గ్రే! నేను ఓడ వదిలి వెడుతున్నాను. నీ అధికారితోపాటు రావలసిందని ఆజ్ఞాపిస్తున్నాను. నీహృదయం మంచిదని, పొరపాటున వాళ్ల కుట్రలో అడుగుపెట్టావని నాకు తెలుసు. నాచేతిలో గడియారం వుంది. ముప్ఫయ్ సెకండ్లు టైమిస్తున్నాను నువ్వు మాతో రావడానికి."

కాసేపు నిశ్శబ్దం.

"వచ్చెయ్, వచ్చెయ్. త్వరగా రావాలి. ఇంకా పది సెకండ్లు మాత్రమే వుంది టైము. ఒక్కొక్క సెకండు గడుస్తున్నకొద్దీ నా ప్రాణానికి, ఈ పెద్ద మనుషుల ప్రాణాలకి అపాయం ఎక్కువౌతోందన్న మాట. వస్తున్నావా?"

హఠాత్తుగా తెరచాపచాటున పెద్ద చప్పుడైంది. దెబ్బలు వినిపించాయి. అబ్రహాం గ్రే ఒక్క దూకులో కెప్టెన్ స్మాలెట్ వద్దకు వచ్చాడు.

అతని ఎడమ దవడమీద కత్తిగంటునుండి రక్తం కారుతోంది.

"వచ్చానండి సార్. నేను మీతోనే వుంటానండి."

మరుక్షణంలో అతడూ, కెప్టెనూ బోటులోకి దూకారు. వెంటనే బోటు కదిలింది. పిస్టల్ ధ్వని వినిపించినప్పుడు మూర్ఛపోయినవాడే అబ్రహాం గ్రే.

## 17. యుద్ధం మొదలు.

(డాక్టర్ చెప్పిన కథ)

ఈ ఆఖరి ప్రయాణం మాకు అపాయకరంగానే పరిణమించింది. బోటులో అయిదుగురం వున్నాం. అందులో ముగ్గురు—జమీందారు, కెప్టెన్ స్మాలెట్, రెడ్రూత్ లు—ఆరడుగులకంటె పొడుగున్న మనుషులు. అదికాక తుపాకిమందు, బిస్కట్లసంచులు. దీంతో బోటు ఏక్షణాన్నైనా మునిగిపోవచ్చు ననిపిస్తోంది. అంచులు నీటిమట్టానికి దాదాపుసమానంగాఉన్నాయి. పెద్దతరంగం వచ్చినప్పుడల్లా లోపలికి నీళ్లు వస్తున్నాయి. ఆ నీళ్లను వెంటనే తోడివేస్తున్నాము కాబట్టి సరిపోయింది, లేకపోతే, మునిగిపోయేవాళ్లమే. గట్టిగా ఊపిరిపీల్చటానికి కూడా మాకు భయంగా ఉంది.

అదల్లా ఉంచి, సముద్రపుపోటు మమ్మల్ని ఒడ్డుకు చేరనివ్వడంలేదు. ఎంత బలంగా తెడ్లువేసినా బోటు కదలటంలేదు. కదిలితే పడమటికో, నైరృతికో కదులుతోందిగాని మేము చేరవలసినదిశగా మాత్రం కదలటంలేదు. ఈ లెక్కన మేము పడమటివైపున సిల్వర్ వాళ్లబోట్లు నిలిచినరేవుకు చేరేటట్లున్నాము.

నాబలం యావత్తూ ఉపయోగించి చుక్కాని పట్టుకున్నాను. "కెప్టెన్! చుక్కాని నిలవటంలేదు. ఇంకొంచెం బలంగా తెడ్లువెయ్యగలరా?" అని అడిగాను. కెప్టెన్, రెడ్రూత్ తెడ్లువేస్తున్నారు. కెప్టెన్

అన్నాడు: "తెడ్డు ఇంక ఏమాత్రం గట్టిగా ఊపినా పడవ తల్లకిందు లౌతుంది. ఇంకొంచెంసేపు చుక్కానితో తంటాలు పడండి."

అంతవరకూ నేను మట్టికోటదిశగా చుక్కాని పట్టుకున్నాను. అందుచేత మాపడవని కెరటాలు పడమటగా ఉన్న సిల్వర్ బోట్లకేసి తోసివేస్తున్నాయి. అదిచూసి కెప్టెను తూర్పుగా తిప్పమన్నాడు చుక్కాని. వెంటనే బోటు తూర్పుగా ప్రయాణం సాగించింది.

"ఇట్లా అయితే మనం ఒడ్డు ఎంతసేపటికీ చేరుకోలే మనుకుంటానండి," అన్నాను నేను.

"ఫరవాలేదు. ఎక్కడో ఒకచోట ఒడ్డును సమీపించగలం. సిల్వర్ గాడి బోట్లదగ్గిరికి పోకుండా వుంటే చాలు. ఒకవేళ మనం మట్టికోటకి దూరంగా చేరినా, ఒడ్డువెంబడే పడవ నడిపి తేలిగ్గా అసలు చోటుకు వెళ్లగలం," అని ఉపాయం చెప్పాడు కెప్టెన్.

"కెరటాలు తగ్గుతున్నాయి సార్, అప్పుడే," అన్నాడు అబ్రహాంగ్రే.

"మంచిది," అన్నాడు కెప్టెన్ తల వూపుతూ. గ్రేను మాలో వాడిగానే పరిగణించడానికి నిశ్చయించుకున్నాము.

హఠాత్తుగా కెప్టెన్ స్మాలెట్ అరిచాడు: "ఫిరంగి!"

నే నన్నాను: "ఫిరంగి ఏం ఫరవాలేదు. దాన్ని ఓడలోనుండి ఊడదీయటం అసాధ్యం. ఒకవేళ ఊడదీసినా ఒడ్డుకి తీసుకురావటం, చెట్లగుబురుల్లోంచి మన మట్టికోటదాకా తీసుకురావటం వాళ్లతరం కాదు." (ఓడలో బ్రహ్మాండమైన ఫిరంగి ఒకటుంది. దాంతో పేలిస్తే మా మట్టికోట దెబ్బ కెగిరిపోతుంది.)

"అది కాదు డాక్టర్!

తిరిగిచూడండి. వెనక్కి" అందరం ఓడకేసి చూశాము. ఓడలో మిగిలిన అయిదుగురు ద్రోహులు ఫిరంగిని మాబోటుకేసి తిప్పటానికి ప్రయత్నిస్తున్నారు. ఒకడు మందు కూరుతున్నాడు. మేము వచ్చేటప్పుడు ఫిరంగిగుండ్లు, మందూ ఓడలోనే వదలివేసి వచ్చాము. ఆ తొందరలో వాటినికూడా సముద్రంలో పారవెయ్యాలని మాకు జ్ఞాపకం రాలేదు.

"కెప్టెన్ఫ్లింట్ ఎప్పుడూ ఇజ్రాయెల్ హాండ్స్‌ని మెచ్చుకుంటూ ఉండేవాడు, ఫిరంగి చాలా బాగా పేలుస్తాడని," అన్నాడు అబ్రహాంగ్రే.

ఈలోగా మేము ఓడనుండి చాలదూరం వచ్చేశాము. కాని ఫిరంగి పేల్చబడితేమాత్రం మేము నామరూపాలు లేకుండా ధ్వంసమవుతాము. ఈ ప్రమాదం గమనించి కెప్టెన్ స్మాలెట్ అడిగాడు:

"మనలో ఎవరు బాగా గురిపెట్టగలరు?"

"ట్రెలానీ!" అన్నాను.

"ట్రెలానీగారూ! దయచేసి మీరు నాకో ఉపకారం చేయాలి. వాళ్లలో ఒకణ్ణి, వీలైతే ఇజ్రాయెల్ హాండ్స్‌ని పడగొట్టాలి," అన్నాడు కెప్టెన్.

ట్రెలానీ మారుమాట లేకుండా తుపాకీ తీశాడు.

"జాగ్రత్తగా ఉండండి. ట్రెలానీగారు పేల్చే సమయానికి ఈపక్కకి ఒరగండి. ట్రెలానీగారూ! తుపాకీ కాస్త దబాయించి పట్టుకోండి. పడవ ఏమాత్రం ఊగినా తలకిందు లవుతుంది," అని హెచ్చరించాడు కెప్టెన్.

కెప్టెన్ చెప్పినట్టే మేము ఒక పక్కకి ఒరిగి ఊపిరి బిగపట్టి నిరీక్షిస్తున్నాము. ఓడమీద ఫిరంగి మూతికి దగ్గరగా ఇస్రాయెల్ నుంచునివున్నాడు. అతనివెనక మిగతావాళ్లు నుంచున్నారు. ట్రెలానీ ఇస్రాయెల్ కేసి గురిచూసి తుపాకి పేల్చాడు. కాని వాడు ఆ సమయానికి నేర్పుగా వంగాడు. గుండు వెనకాల మనుషుల్లో ఒకడికి తగిలింది. వాడు నేల కొరిగాడు. ఓడమీదవున్న వాళ్లందరూ "బాబోయ్" అని ఒక్కసారిగా కేకలువేశారు. ఆ కేకలను ప్రతిధ్వనిస్తున్నట్లుగా సిల్వర్ పడవలు వున్న ప్రదేశంనుండి మిగతా కుట్రదారులందరూ కేకలువేశారు. ఒడ్డునవున్న ఒక బోటులోకి కొందరుఎక్కి మా పడవను వెంబడించడానికి ప్రయత్నిస్తున్నారుకూడాను. మిగతా వాళ్లలో కొందరు ఒడ్డునే మాకేసి పరిగెత్తి వస్తున్నారు. కాని వాళ్లుగాని, కుట్రదారుల పడవగాని మమ్మల్ని సమీపించేలోగానే ఒడ్డు చేరుకోగలమనే ధైర్యం మాకున్నది. మా కింకా ప్రమాదకరంగా ఉన్నది హిస్పానియోలాలోని ఫిరంగి ఒక్కటే.

"ట్రెలానీగారూ! మరోకణ్ణి పడగొట్టాలి" అన్నాడు కెప్టెన్.

ట్రెలానీ మళ్ళీ తుపాకిఎత్తి గురిపెట్టాడు. ఈసారి దెబ్బకు విద్రోహుల్లో ఎవరు కూలిపోయారో చూసే వ్యవధిలేదు మాకు. ఎందుకంటే తుపాకి ప్రేలగానే మాపడవ ఒక్క గంతువేసి మునిగిపోయింది. నేను, కప్టెను కొంచెం జాగ్రత్తగా ఉండబట్టి నిలదొక్కుకోగలిగాము. మిగిలిన ముగ్గురూ బోటుతోపాటు మునిగారు. కాని ప్రాణనష్టం ఏమీ జరగలేదు. బోటులోఉన్న సామగ్రిమాత్రం నష్టమైంది.

రెండుబారలు యీదేసరికి కాళ్లకు నేల అందింది. పూర్తిగా తడిసిపోయి సాధ్యమైనంత వేగంగా ఒడ్డుకి వచ్చాము. ఒడ్డునే పరిగెత్తివచ్చే తిరుగుబాటు దార్లు మమ్మల్ని ఎదుర్కొనేలోగానే మట్టికోటను చేరుకోవాలని మా ఉద్దేశ్యం. వాళ్లు అంతకంతకు మమ్మల్ని సమీపిస్తున్నారు. మట్టికోట ఇంకా డభ్భయ్ ఎనభైగజాల దూరంలో ఉంది. ఒకవేళ ఈలోగానే వాళ్లెదురుపడితే ఏం చెయ్యాలో మాకు తోచలేదు. నాదగ్గిర, కెప్టెన్ దగ్గిర మాత్రమే తుపాకులున్నాయి. ట్రెలానీదగ్గిర తుపాకి ఉన్నదిగాని అది తడిసిపోయి పనికిరాకుండాపోయింది. అందుచేత ట్రెలానీ కెప్టెన్ తుపాకిని తీసుకున్నాడు. అబ్రహాంగ్రే దగ్గర ఏ ఆయుధమూ లేకపోవటం చూసి నాకత్తిని అతని కిచ్చాను. ఈవిధంగా సన్నద్ధులమై చెట్లను మరుగుగా చేసుకుంటూ మట్టికోటదిశగా నడవసాగాము.

(ఇంకా వుంది.)

## నిలువుటద్దం

(22-వ పేజీ తరువాయి)

ఎక్కడెక్కడి బంధువులనూ శారశాల కాహ్వానించినాడు శాస్త్రి. అతని జీవితంలో—అదే మొదటిరోజూ, తుదిరోజూ, అంత ధనవ్యయానికి. వాకిట మేళతాళాలు వాగినాయి. పండితినాడు నాలేని ఆనందం, అప్పుడు తాండవించింది, ఆ దంపతుల హృదయాల్లో. హాలంతా కిటకిటలాడుతూంది. పీటలమీద కూచునేసమయమూ సన్నమయింది. పురోహితుడు తొందరిస్తూంటే, మొదట సుబ్బలక్ష్మి బిడ్డతో సహా వచ్చి అగ్నికుండాని కెదుట కూర్చుంది. ప్రక్కను ఖాళీపీట కనబడుతూంది. శాస్త్రి లోపల పెట్టె తెఱచి, పట్టుపంచె బయటికి తీస్తున్నాడు. అంతలో 'హలో డాక్టర్ !' అన్న మాట వినవచ్చింది. పంచె అట్లానే చేతపట్టుకొని, శాస్త్రి హాలులో అడుగుపెట్టినాడు. అతని కండ్లనే అతడు నమ్మలేకపోయినాడు. ఖాళీపీటమీద గంభీరంగా—తన భార్య ప్రక్కనే ఆసీనుడైనాడు, డాక్టరు!—'కానీ! కావలసిన కార్యకలాపం'—అని పురోహితుడిని తొందరిస్తున్నాడు!—అందరూ వికటంగా తెసపంక చూస్తున్నారు!—శాస్త్రి దిగ్భ్రాంతుడైనాడు! అతని చేతిలోనుండి ఆ పట్టుబట్ట క్రిందికి జారింది. సుబ్బలక్ష్మి పటకారంగా నవ్వుతూ, ఒయ్యారంగా చూచింది. ఆమె కథానాయికత్వం చూచినవాళ్ళకూ, చూడనివాళ్ళకూ బట్టబయలయింది. ఇది యీనాడు కొంతమందికి నిలువుటద్ద మేమో ? ★

# అల్లుగాడి పెళ్లి

(16-వ పేజీ తరువాయి)

ఎక్కడా లేవన్న సంగతి స్ఫురణకి వచ్చింది. కరెంటు ఆగిపోయింది గాబోలు.

చిన్నపిల్లలు కొందరు పడుకున్నారు. నేనుకూడా పడుకో కూడదా అనిపించింది. మళ్ళా భోజనం సంగతి జ్ఞాపకం వచ్చింది. ఎంతసేపవుతుందో? అమ్మను కనుక్కుందా మంటే కనపడదు.

"పెళ్లివారింటికి" వెళ్లాను.

అదుగో, ఆ పిల్లే పెళ్లికూతురు.

సరే, బాగానే వుంది. మరి భోజనం అక్కర్లేదు హాయిగా పడుకోవచ్చు. అంత చక్కా వుందా అమ్మాయి.

పాపం! ఎంత ఇదిగా వున్నా ఇష్టా యిష్టాలుండవా? ఈవిధంగా వ్యక్తిత్వమనేది మొగ్గ తొడక్కముందే తుంపెయ్యాలా! ఛీ, "పెద్దలు" మొద్దులు.

ఇటొచ్చాను.

అదుగో ఆమూల పెళ్లికొడుకు శ్రీ ఉన్నాడు. ఏమిరా ఎవడూ కనపడ్డేం? అన్నాను. ఏమో బావా అన్నాడు. ఓరి వెధవా వాళ్ళందరూ, మీ అమ్మ మా అమ్మావాళ్లూ ఏమయ్యేర్రా అన్నాను. వెధవ అన్నాను. పాపం! పసివాడు!!

ఒరేయ్! నీ కిప్పణ్ణించీ పెళ్ళవడం నా కిష్టం లేదురా, నీకేగాదు. ఎవడికైనా యింత చిన్న వయస్సులో పెళ్ళవడం నా కిష్టంలేదు. నీ పెళ్లికీ, నేను బలవంతంమీద వొచ్చాను తెలుసా? ఆఁ అంచేత, నీపెళ్లి నేను చూడదల్చుకోలేదు. అంచేత, భోం చేసి వచ్చి ఇక్కడ పడుకుంటాను. ఎవణ్ణీ లేపనియ్యకు! అన్నాను. వాడు తెల్లబోయి చూశాడు.

ఎలెక్ట్రిక్ లైట్లు వెలిగాయి. వాడు నా నిక్కచ్చితనానికా? ఆశ్చర్యంగా చూశాడు!

* * *

రాత్రి భోంచేసే సరికి పదైంది. సినీమాకి వెళ్లాలని జ్ఞాపకం వచ్చేసరికి పద కొండు అయింది.

అరెరె! టైమ్ దాటిపోయిందే!

పోనీ, నిద్రపట్టటం లేదుగా, ఓసారి అలా తిరిగొద్దామనుకుంటూ ఉండగానే ఎవరో సినిమానించి అప్పుడే వొచ్చి పట్టు పంచకట్టి పెళ్లివారింటికి దారితీస్తున్నారు.

అప్పుడు జ్ఞాపకమొచ్చింది. ఊరికి కరెంటు లేటుగా రావడం. సినిమా ఆల స్యంగా విడిచిపెట్టారనీ, అందుచేత రెండవ ఆట ఇంకా మొదలు పెట్టరనీ.

వెళ్లాను.

మళ్లా వొచ్చేసరికి మూడైంది. మా అన్నయ్య రాముడు మా అమ్మను లేపుతున్నాడు!

అమ్మ లేచి "ఎక్కడి కెళ్లావురా బడుద్ధాయ్?" అంది. కాని వెంటనే రాముణ్ణి చూసి చల్లారింది.

పడుకున్నాను. నిద్దర పట్టలేదు.

"వీడు వొస్తాడనుకోలేదు - ఏంరా క్రిష్టా వొచ్చేశావ్? కుర్రాడికి పదహారేళ్లే కదా!" అన్నాడు రాముడు.

"వీళ్లుండ నిచ్చేరు గాదురా. ఎంతో అన్నాను, ఉండిపోతానని."

"అవునమ్మా, వాణ్ణి ఉండిపోనివ్వలేక పోయినారా?"

"బాగుందిరా, నవ్విపోతారు!"

రాముడు తను అంతిదూరం నించి వొచ్చిన పరిస్థితులు చెప్పాడు. మొత్తం నాలుగైంది పావు తక్కువ.

"ఇంక లెండి. ముహూలు కడుక్కొని తల్లు దువ్వుకుని మంటపానికి రండి. ఒరే క్రిష్టా, లే, ఏమి టాపడక?"

"నేను లేవను. పడుకోవాలి. సినిమా కెళ్ళొచ్చాను."

"సినిమా కెళ్లాని కొచ్చావా యేమిటీ?"

"లేకపోతే పెళ్లి చూడ్డానికా?"

"ఏడిశావు, ఇర్రివేషాలూ నువ్వూను. లే ముందు! అందుకొక్కపోతే మరెందు కొచ్చావు, బ్రహ్మాజమానుడా?"

"ఒరే క్రిష్టా, మరి పడుకున్నా నిద్దర పట్టదు. లేచి పదరా ఎవరన్నా చూస్తే బాగుండదు" అన్నాడు రాముడు.

అమ్మ పెట్లోంచి టూత్ పేస్టూ, బ్రష్షూ, సబ్బూ, నా లేత ఎరుపురంగు బుష్‌కోటూ సిమ్మెంటురంగు పంట్లామూ తీసింది.

"ఆరెండూ నిన్నవడు తెమ్మన్నాడు?" అని కోప్పడ్డాను.

"అదేమో నాకేం తెలుసు. అవే మంచి వనుకొని చేతికి దొరకంగానే పట్టు కొచ్చేను."

"మంచివనే, ఏడుస్త. ఈ వెధవ పెళ్లికి ఇంత మంచి వెందుకూ? నేను స్పెషలుగా దాచుకోం టేనూ?" అన్నాను.

"చ్ఛ్, ఏదో ఒకటి తొడిగీసుకోరా క్రిష్టా" అన్నాడు రాముడు.

వొళ్ళు మండింది.

మొహంమీద మాత్రమే నీళ్ళు పోసుకుని సబ్బు పట్టించి ఎక్స్‌ట్రా నిర్వర్తించి 'పద' అన్న ఆజ్ఞ చేశాను.

మంటపంలో కూచున్నాం.

ఈ మూలనించి ఎవరో పెద్దాయనే, నా బుష్‌కోటువంకో నా వంకో యిదిగా చూస్తున్నారు. "మా తమ్ముడు" అన్నాడు రాముడు ఆయనతో.

"ఒరే మా గొప్ప గుడ్డ కొట్టేశావురా?" అన్నాడు నాతో.

"ఏం?"

"బుష్‌కోటు మోకాకింద వుంది."

ఈ సారొస్తే నీకు తీస్తాలే."

పెళ్ళంటే ఏమిటి చూసేది? మంగలాళ్లు డోళ్ళూ గీళ్ళూ దంచేస్తుంటే, ఒకాయన ఎవరో లీడ్ చేస్తూండగా కోరికగా వొచ్చే మంత్రాల్ని వినాలా, లేక ఒకడు ఒకతె మెడలో ఒకతాడు కట్టడం చూడాలా?

ఒకటి వింటే చెవులు మోత ఎత్తేది.

ఒకటి ఒక్కసారి చూస్తే చాలు.

అవైన తర్వాత బియ్యం ఒకరి బుర్రల మీద మరొకరు ఒంపుకున్నారు. ఎబ్బే!

* * *

మధ్యాన్నం భోంచేసిన తరవాత, నాకు పెళ్లితో సంబంధం లేదన్న 'మిథ్యావాదం' వల్ల ముందుగా విడిదికి పోయాను. పేపరు వాడు కనపడగా కొని, పరుపుమీద నడుం వాల్చి చదువుతున్నాను.

నాన్నా, అదెవరో మరోఆయనా తమలపాకులు నములూ వస్తున్నారు.

"వీడే" అన్నారు నాన్న నన్ను చూపించి.

"ఆఁహాఁ! బియ్యే ప్యాసయ్యాడా?"

"లేదు. చదువుతున్నాడు."

ఈయన తెల్లవారకట్ల రాముణ్ణి నన్ను గురించి అడిగి నాయనే.

లేచి వెళ్ళాను.

సాయంకాలం దాకా వాళ్ళకి మరి కనపడలేదు. పెళ్ళికొడుకు గదిలో వాళ్ల పరుపుమీద బిచాణా వేశాను.

ఆనక ఫలహారానికి వొచ్చినప్పటికి ఇందాక టాయన, ఓ పదమూడు పధ్నాలుగేళ్ళపిల్ల, మా రాముడు, అమ్మ, నాన్న, రమ, శాస్త్రి అందరూ మా గదిలో కూర్చున్నారు.

నన్ను అంతదూరంలో చూడగానే మా రాముడు ఇవతలికొచ్చి "ఒరే క్రిష్ణా నీ మేరేజి సెటిల్ చేసేశార్రా!" అన్నాడు.

"ఏడిసినట్టుంది."

"నిజమేన్రా బాబూ!"

"అయితే నేను వాళ్ల ఎదట పడను. నీదగ్గిర డబ్బులుంటే ఇయ్యి, కాఫీ తాగి వొస్తాను." అన్నాను. లోపల దిగులు ఇంతా అంతా కాదు.

"లోపల నీకోసం దాచారు!"

"ఉరేట్టుకోమను. ఎంతసేపూ స్వేచ్ఛలేని బ్రతుకైపోయింది. వాళ్లకేమన్నా బుర్ర వుందిరా, పద్ధెనిమిదో యేట పెళ్ళి చేస్తారు!" అన్నాను ఉడికి.

"తప్పేమిట్రా, నేనూ గోపాలం చేసుకున్నాం గదుట్రా?"

"మీరు చేసుకుంటే చేసుకున్నారు. నేను చేసుకోన్రా!"

వాడు ఇస్తున్న రూపాయి తీసుకున్నాను. సాగిపోతో వుంటే నాన్న పిల్చారు. "ఒరే, బాబూ, రాధాక్రిష్ణా! రారా యిలా ఒకసారి!"

నేను ద్వారందగ్గిర కనపడి "వొస్తానుండండి నాన్నా, చిన్న పనుంది!" అన్నాను.

"ఆనక చేద్దువుగాని లేవోయ్! ఇలారా. కాసేపు కూచో–వీళ్లు చూశావా, అందరూ మనవాళ్ళు. నీకోసం కూచోబెట్టాను. నువ్విలా వెళిపోతే ఎలాగ?"

తలవంచుకు అమ్మపక్కని కూచున్నాను. ఒకటిరెండు నిమిషాల్లో నా వ్యక్తిత్వం తల ఎత్తి ఆ అమ్మాయివేపు చూసింది. సౌందర్య పోటీలో ఎన్నిమార్కులూ వేయకముందే చూపు మళ్లించడం కూడా అయింది.

దిగులుగా, బరువుగా వున్న శరీరంతో అలాగే కూచున్నాను.

* * *

నిక్కచ్చితనం ఎక్కడికి పోయింది? సభ్యత్వపు సన్నతెరలు దీని కోక అడ్డా? ఏమిటీ దౌర్బల్యం? ఇంటికెళ్ళేవరకూ ఎదిరించడం ఎందుకు సభ్యంగా తోచలేదు?

"నే నిప్పట్నించే పెళ్లిచేసుకోనమ్మా?"

"మాశారండీ వీడు?"

"అలా అంటే ఊరుకోమని చెప్పలా, నీకూ?" అన్నారు నాన్న.

"ఏమిటి నాన్నా, నాకు పెళ్ళక్కర్లేదంటూ వుంటే వినరేమి?"

"కావాలని నే నంటున్నాను."

"అక్కర్లేదని నే నంటూంటే?"

"ఏం, తీపు దిగదీసిందా? బంగారబ్బొమ్మ లాంటి పిల్ల, మూడువేల నగలు కట్నమూ, సాంప్రదాయపు కుటుంబమూ, దొబ్బుడాయరా?"

"మీ యిష్టమొచ్చిన పిల్లనే చెయ్యండి నాన్నా, రెండేళ్ళు పోయేక?"

"నా యిష్టమొచ్చిన పిల్లగాకపోతే నీ యిష్టమనుకున్నావేమిటి?"

"అప్పుడైతేనండి. రాముణ్ణీ గోపాలాన్నీ ఇలాగే మోసం చేశారు. నన్నూ చేయవలసింది; కాని నా అదృష్టవశాత్తూ పిల్ల బాగుండిపోయింది!" అన్నాను.

"ఏం, వాళ్ళు బాగులేరా?"

"అనే కదేమిటి, అర్థం?"

"ఎవరన్నారా మాట? రామగోపాలేనా?"

"ప్రతీదీ రామగోపాల్ అంటేగాని నాకు తెలీదేమిటి నాన్నా?"

"తెలుసు." అని నాన్న వెళ్లిపోయారెక్కడికో.

చివరికి పెళ్ళొద్దని ఎన్నిసార్లు అన్నా ప్రసంగం మారేది కాని అంత మయ్యేది కాదు.

"నాకు ఈ పెళ్లి చేశారంటే ఇంట్లోంచి పారిపోతానమ్మా!" అన్నాను ఓసారి మా అమ్మతో, మూహం ముడుచుకుని.

"పారిపోవోయ్. ఎన్నాళ్ళు అక్కడుంటావో నేనూ చూస్తానూ!" అంటూ నాన్న వచ్చారక్కడికి. చేతులో పచ్చటి కాగితాలకట్ట ఉంది.

నేను ఏమననూ?

"ఇంత కాఠిన్యం తగదు నాన్నా!" అని వెళ్లి మంచంమీద పడుకున్నాను. ఏడుపు రాలేదు. బహుశా ఒక ప్రియురాలే ఉండినట్టయితే ఏడ్పు వచ్చేదా, అనిపించింది నా సినిమా తెలివికి.

రామగోపాలుకు,

మా అల్లుగాడి పెళ్లికి ఒక ఆదర్శం మంటగలుపుకుందికి వెళ్లాను. అక్కడ రెండో ఆదర్శం, అంతకంటె ముఖ్యమైనది కూడా నాశనమైంది. దీంతోబాటు శుభలేఖ పంపుతున్నాను. నువ్వు రావద్దు. కనీసం నీ ఆదర్శమైనా కాపాడుకో. ఆ వూరు, ఆ దౌర్భాగ్యపు ఊరు ఆదర్శాలకి సమ్మెట పెట్టు. అనుభవజ్ఞుణ్ణి చెప్తున్నాను. ఎన్ని రోజుల్లో ఏడ్చినా నాకు ముక్తి రాలా. రోజురోజూ పట్టుదలా, పైకి చెప్పనే నిక్కచ్చితనం ఎలా పోయాయో, లోపల్లోపలే కుమిలిపోయే నైరాశ్యం ఎలా ఆవహించిందో నాకు తెలీదు. నన్నింకేం అడగవద్దు.

నీ

దౌర్భాగ్య మిత్రుడు

రాధాకృష్ణమూర్తి

ఉత్తరం ముగించి నా పెద్దలు గుడిసే గుడిలో లింగాన్ని మింగారే అని వాపోయాను.

నిక్కచ్చితనపు చివరి సన్నివేశం ఇక్కడ వుంది: పెళ్లికి ముందురోజున నేను ఓ చోట పెళ్లికూతుర్ని ఒంటరిగా కలుసుకుని, ఆ పిల్లే పెళ్లికూతురని నిర్ధారణ అయ్యాక అడిగాను: "నీకీ పెళ్లి ఇష్టమేనా?"

ఆ పిల్ల దారికోసం వెతికింది. కాని లేక సిగ్గుపడి ఏమీ అనక ఊరుకుంది.

"చెప్పు. సిగ్గుపడొద్దు. ఈ పెళ్లి నీకేమైనా యిష్టమా?"

"........"

"పారిపోవద్దు. చెప్పు. నీకేమైనా యిష్టమైతే ఊరుకుంటాను. నీకోసమే అయినా ఊరుకుంటాను. నాకు కొంచెం కూడా యిష్టంలేదు. నీకూడా యిష్టం లేకపోతే రేపొందుకీ పెళ్లి ఒట్టి వేషం. అంచేత నీకిష్టం లేకపోతే చెప్పు. తక్షణం కేన్సెల్ చేయించేస్తాను!" అన్నాను గబగబా.

ఏ ధైర్యం మాసుకుని అన్నాను?

ఆ పిల్ల మాట్లాడకపోవడం చూస్తే కోపం రాలేదు. ఏడుపొచ్చింది.

నేను అయిష్టంగా ఉండడం, ఒక్కమాటా మాట్లాడకపోవడం, అందరూ చూశారు. మా నాన్న "అదే సర్దుకుంటుంది!" అన్నారు.

మా చెల్లెలు రమ నేను పెళ్ళికూతుర్తో ఆడిన మాటలు మూడూ మా అమ్మతో చెప్పింది. అమ్మ నాన్నతో చెప్పింది.

నాన్న "ఏడిశాడు." అన్నారు.

రామగోపాల్ వచ్చాడు పెళ్లికి. నాకు నోట మాట రాలేదు.

"ఛప్పు, సిగ్గుపడకయ్యా, ఏం చేస్తాం మనం? తల్లిదండ్రుల కవసరమని తోస్తే మనం కాదన్నా వింటారా?" అన్నాడు.

* * * *

పందిట్లో, పురోహితుడు మంత్రాలు చదువుతుండగా, మంగళాళ్ళు వాయిద్యాల్ని మ్రోయించగా, అందరూ సంతోషించగా, నేను పెళ్లికూతురుమెడలో బంగారం వేలగట్టిన పసుపుతాడొకటి కట్టాను.



# ★ రష్యాలో సినిమా ★

శ్రీ కె. సుబ్రహ్మణ్యం

[ఇటీవల రష్యా వెళ్లివచ్చిన భారతీయ సినిమా ప్రముఖులలో ఒకరైన శ్రీ కె. సుబ్రహ్మణ్యంగారిని మా ప్రతినిధి కలిసి మాట్లాడిన సందర్భంలో ఆయన రష్యాలో తాము తెలుసుకున్న సినిమా వివరాలను గురించి ఈ క్రిందివిధంగా చెప్పారు—సం]

నేను రష్యాలో సినిమాకుసంబంధించినవారిని పలువురిని చూశాను. రష్యా ప్రభుత్వ సినిమటోగ్రఫీ శాఖలోని ఉన్నతాధికారులను దాదాపు అందరినీ కలుసుకొని మాట్లాడాను. నేను అక్కడ చేసిన ప్రసంగాలలో కొన్నింటికి రష్యాప్రభుత్వ మంత్రులుకూడా హాజరైనారు.

రష్యన్ సినిమాప్రపంచంలో గల ఉత్తమోత్తమ చిత్రనిర్మాతలనూ, దర్శకులనూ, తారలనూ, టెక్నీషియనులనూ కలుసుకున్నాను. ఉత్తమ నిర్మాతలలోనూ, దర్శకులలోనూ ఎంతోమంది స్త్రీలు! వారిని గురించి ఇక్కడ మనం వినలేదు.

"బిగ్ కాన్సర్ట్", "మారిటే" అన్న చిత్రాలు తీసిన డైరెక్టరు స్ట్రోయినా అనే స్త్రీ. "మారిటే" అన్న చిత్రం "రికార్డు"లన్నీ "బ్రేక్" చేసింది. ఈమె చాలా ఉత్తమశ్రేణికి చెందిన డైరెక్టరు. (కొన్ని గ్రంథాలు రాసిఉండటంవల్లా, ఇంగ్లీషు భాష వచ్చినవాడు కావటంవల్లా మనం పుడోవ్కిన్ పేరు హెచ్చుగా విన్నాం, గాని అక్కడ పుడోవ్కిన్ ను మించిన డైరెక్టర్లు చాలామంది ఉన్నారు.)

ఆంద్రేయ్ ఫ్రాలోవ్ ను కూడా కలుసుకున్నాను. అతను "క్యూబన్ కోసాక్స్" తయారుచేసినవాడు. ఇటీవల జరిగిన "బెర్లిన్ యూత్ ఫెస్టివల్"కూడా ఆయన నిర్మాణమే. ఈ చిత్రం మనదేశంలో జరగబోయే అంతర్జాతీయ ప్రదర్శనానికి రానున్నది.

"బెస్ప్రిడాన్నిజా" (కట్నం లేకుండా) అన్న చిత్రంలో నటించిన అలిజోవా అనే తారను కూడా కలుసుకొని మాట్లాడాను. ఈమె అతిప్రసిద్ధ సౌందర్యవతి అని చెబుతారు. ఈమె నటించిన ఈ చిత్రం కూడా అంతర్జాతీయ చిత్రప్రదర్శనానికి వస్తున్నది.

"బెర్లిన్ పతనం" అన్న చిత్రంలో నటించిన మారినా కొవలోవానూ కూడా కలుసుకున్నాను. ప్రభుత్వ నిర్వహణలో కూడా చిత్రాలు లాభసాటిగా ఉండగల వనటానికి "బెర్లిన్ పతనం" కంటె ఉదాహరణ అవసరం లేదు. ఈ చిత్రాన్ని 110 లక్షల రూబుల్స్ ఖర్చుచేసి తయారుచేశారు. దీని మీద రెండు వారాలలో 1380 లక్షల



భారతీయ సినిమా ప్రతినిధివర్గానికీ, చైనా ప్రతినిధివర్గానికీ కలిపి రష్యాలోని నాటకాల డైరెక్టర్లిచ్చిన సన్మానంతాలూకు ఫోటో.
1. ఎస్. ఎస్. కృష్ణన్ 2. ముఖర్జీ 3. నిమ్మోఘోష్ 4. కె. సుబ్రహ్మణ్యం 5. భట్టాచార్య 6. దుర్గాఖోటే 7. టి. ఎ. మధురం.

రూబుల్స్ లాభం వచ్చింది! 3500 కాపీలు విడుదల చేశారు. కోవలోవా అనే తార "మరపురాని 1919" అనే చిత్రంలోకూడా నటిస్తోంది. ఈ చిత్రం ఇంకా పూర్తి కాలేదు. (ఈ చిత్రానికి మాతృక స్టాలిన్ బహుమాకృతి పొందిన ఒక నాటకం—సం)

ప్రఖ్యాత మాస్ఫిల్మ్ స్టూడియోకు అధిపతి అయిన కుజ్నెట్సోవ్‌నూ, ఆయనకు సహాయకురాలుగా పని చేసే మరియా ఆంద్రేయ్ పరిట్జా అనే ఆమెనూ కూడా కలుసుకొన్నాను. రష్యాలో కల్లా గొప్ప కామెరామాన్ గా గణించబడే కొన్స్టంటోవ్ ను కూడా చూశాను. కొన్స్టంటోవ్ "బెర్లిన్ పతనం" తీశాడు; "1919" తీస్తున్నాడు.

నేను ఎక్కడికి వెళ్లినా, ఎవరితో మాట్లాడినా చచ్చులేకుండా మాట్లాడాను. "మీరంతా ప్రత్యేక శిక్షణతో ఇంత హంగుతో చిత్రాలు తీస్తున్నారు. కాని మాకు ఉత్సాహం తప్ప మరే శిక్షణా లేదు, పరికరాలు లేవు. మీకున్న సౌకర్యాలతో మీకన్న ఎంతో గొప్పచిత్రాలు తీయగలము," అని చెప్పాను మాస్కో రేడియోలో 8 ప్రసంగాలు చేశాను, రష్యన్ పత్రికలలో ఆరు వ్యాసాలు ప్రచురించాను. వీటికి అక్కడ బాగా ప్రతిఫలం ఇస్తారు. నేను 6 వేల రూబుల్స్ ఈద్వారా సంపాదించాను. ఆ ద్రవ్యం ఇంకెక్కడా మారదు కనుక అక్కడే ఖర్చు చేసేశాం.

కృష్ణన్ మధురంగార్లు రష్యాలో మూడు ప్రదర్శనా లిచ్చారు. సంభాషణలు చాలా తక్కువగా ఉంచి ప్రదర్శనాలు తయారు చేశాం. ఆ ప్రదర్శనాలు చూసి రష్యనులు విరగబడి నవ్వారు. ముఖ్యంగా మధురం హాస్యనటన వారిని తన్మయులను చేసింది.

ఒక సందర్భంలో ఎన్ ఎస్ కృష్ణన్ ఒక రాత్రిల్లా కూర్చొని కంఠస్థం చేసి రష్యన్ల ఎదుట తడువుకోకుండా మూడు నిమిషాలపాటు రష్యన్ భాషలో ప్రసంగించాడు. "మా దక్షిణ భారతీయులతో సమంగా ఇతరభాషలు నేర్చుకోగలవారు ప్రపంచంలో లేరు", అని రష్యన్లకు చెప్పాను......ఒకవేళ కృష్ణన్ మాట్లాడిన రష్యన్ భాషలో ఎక్కడైనా తప్పులు దొర్లినా, హాస్యగాడు గనక వారు పట్టించుకొని ఉండరు... మే మక్కడ ఉన్నంత కాలమూ ఏదైనా గంభీరవిషయాలు ప్రసంగించవలసివస్తే నేనూ—హాస్యధోరణిలో మాట్లాడవలసివస్తే కృష్ణన్—ఈ విధంగా పంచుకున్నాం.

రష్యాలో మా పర్యటన యావత్తూ డాక్యుమెంటరీ చిత్రంగా తయారుచేశారు. అది 6 వేల అడుగుల పొడుగున్నది. త్వరలోనే ఇక్కడికి వస్తుంది మీరంతా చూడవచ్చు.

రష్యాలో డాక్యుమెంటరీచిత్రాలకు చాలా ప్రాముఖ్యం ఉన్నది. వాటిని తయారుచేసేటందుకు వేరే ప్రత్యేకసంస్థ ఉండటమే గాక డాక్యుమెంటరీలు మాత్రమే ప్రదర్శించటానికి మాస్కోలో ప్రత్యేకంగా 5 థియేటర్లున్నాయి.

డాక్యుమెంటరీ చిత్రాలలాగే, చిన్న పిల్లల చిత్రాలూ, 'కార్టూన్' చిత్రాలూ



శ్రీ కృష్ణదేవరాయల అంతఃపురంలో ఉషాపరిణయ ప్రదర్శనం:
వాహినీవారి "మల్లీశ్వరి"లో ఒక దృశ్యం



అంజలిపిక్చర్స్ "పరదేశి"లో అంజలీదేవి

యాసచేయటానికి వేర్వేరు సంస్థలు ప్రత్యేకంగా ఉన్నాయి.

రష్యా అంతటా కలిసి 50 వేల సినిమా థియేటర్లున్నాయి. వీటిలో ప్రదర్శించే చిత్రాలను చూడటానికి ఇక్కడి లాగే టిక్కెట్లు కొనుక్కొని వెళ్లాలి. ఇవిగాక రష్యాలోని వివిధ ఫాక్టరీలలో, విశ్రాంతి మందిరాలలో, సమష్టి వ్యవసాయ క్షేత్రాలలో, క్లబ్బులలో, పాఠశాలలలో 49 వేల ప్రైవేటు సినిమాలున్నాయి. ఇవి వారానికి రెండురోజులుమాత్రమే సినిమాలు ఆడతాయి. నామకః అద్దె పుచ్చుకుని ప్రభుత్వం ఈ థియేటర్లకు చిత్రాలు సప్లయిచేస్తుంది.

మాస్కోలో మాత్రమే 41 వేల టెలివిజన్ సెట్లు కూడా ఉన్నాయి. మాస్కోలోనే ఒక స్టీరియో సినిమాథియేటర్ కూడా ఉన్నది. ఇందులో ప్రదర్శించే చిత్రాలలో "దూరం" తెలుస్తుంది. కాని ఈ థియేటర్ ఇంకా సంతృప్తికరంగా లేని కారణంచేత ఇటువంటి థియేటర్లు మరికొన్ని నిర్మించలేదు. దీనిని నిర్దుష్టంచెయ్యటానికి పరిశోధనలు జరుగుతున్నాయి.

ప్రజలకు చిత్రాలద్వారా ప్రబోధం కలిగించటానికి ఒక ఉదాహరణ లెనిన్ మ్యూజియం. ఈ మ్యూజియంలో ఒక థియేటరున్నది. ఈ థియేటరులో ఉదయం 11 లగాయతు రాత్రి 10 దాకా లెనిన్ చేసిన కృషినిగురించి చిత్రాలు అవిచ్ఛిన్నంగా ప్రదర్శిస్తూఉంటారు. మ్యూజియం చూడబోయేవారు తమ యిష్టం వచ్చినంతసేపు ఈ థియేటర్లో కూర్చొని బయటికి రావచ్చు.

రష్యన్లు మన చిత్రాలు ఆట్టే చూడలేదు. వారికి చారిత్రక వాతావరణం గల చిత్రాలంటే చాలా ఇష్టం. అందుచేత వారితో ప్రసంగిస్తూ శ్రీ బి. ఎన్. రెడ్డి గారి "మల్లీశ్వరి"ని గురించి ప్రస్తావించాను. అది చారిత్రక వాతావరణం గల చిత్రం. బహుశా ఈ చిత్రం రష్యాలో ప్రదర్శింపబడవచ్చు. ★



"పాలేరు"లో దుష్టపాత్రధరిస్తున్న కోటీశ్వరరావు

## ★ సినిమావార్తలు ★

### రష్యన్ సినిమా ప్రదర్శనం

మద్రాసులోని సౌత్ ఇండియా ఫిలిం చేంబర్ వారు తమ ఆవరణలో (19 వుడ్స్ రోడ్) ఈ నెల 8, 9, 10 తేదీలలో రోజూ ఉదయం 11 లగాయతు సాయంకాలం 8 గంటల దాకా రష్యన్ సినిమా ప్రదర్శనం ఒకటి ఏర్పాటు చేశారు. ఇందులో ప్రదర్శించబడిన వస్తువు లన్నిటినీ సేకరించిన వారు కే. సుబ్రమణ్యం, ఎన్ ఎస్. కృష్ణన్ మధురం గార్లు. వీరు ఇటీవల భారతీయ సినిమా బృందం వెంట సోవియట్ యూనియన్ వెళ్లి అక్కడ దాదాపు ఒక మాసం రోజులుండి తిరిగివచ్చిన సంగతి మా పాఠకులెరుగుదురు. ఈ ప్రదర్శనాన్ని ఏర్పాటు చేయటానికి అవకాశం ఇచ్చిన మద్రాసు రాష్ట్రసినిమా ప్రముఖులూ, ఫిలిం చేంబరు వారూ కూడా అభినందనీయులు.

ఈ ప్రదర్శనంలో గల వస్తువులు:

రబ్బరు ముఖాలూ, ముక్కులూ, గడ్డాలూ, పెదవులూ అనేక రకాల మేకప్ సామగ్రీ, మేకప్ పెన్సిళ్లూ, విగ్గులూ, పోర్టబుల్ సినిమా కామెరా, ఫిల్ములూ, స్నాప్ కేసులూ వెలుతురులో మాగజీనులు "లోడ్" చేసే కేసూ; సినిమా ఫిలిం లోడ్ చేసే చేతి కామెరా; ఒక ఎకార్డియన్; సెట్టింగులకూ, నేలకూ వాడే కాగితాలూ; సెల్యులాయిడ్ మీద చిత్రించిన కార్టూన్ చిత్రాల దృశ్యాలు (అనేక పొరలలో); రష్యా భాషలో అనేక సినిమా సాహిత్య గ్రంథాలూ; భారతీయ ప్రతినిధులకు వివిధ స్థలాలలో ఇవ్వబడిన సన్మానాల తాలూకు ఫోటోలూ, బొమ్మలాటల ఫోటోలూ, సర్కస్ ఫోటోలూ; రష్యాలో ప్రసిద్ధ చిత్రకారులు తయారు చేసిన వర్ణచిత్రాల తాలూకు నకళ్లూ; రష్యన్ గ్రామఫోను రికార్డులూ; భారతీయ ప్రతినిధుల రాకను గురించిన వార్త గల "ప్రవ్దా" పత్రిక కాపీ.

ఇందులో కొన్ని వస్తువులను గురించి తెలుసుకోవలసిన అవసరం వున్నది.

రష్యన్ సినిమా పరిశ్రమలో ప్లాస్టిక్ మేకప్‌కు —కృత్రిమంగా ముఖాలు మార్చటానికి— ప్రత్యేక శ్రద్ధ ఇస్తున్నట్టు కనిపిస్తుంది. అనేక తారలు ప్లాస్టిక్ మేకప్‌తో ఎట్లా మార్చబడినదీ సూచించే ఫోటోలు ఈ ప్రదర్శనంలో ఉన్నాయి. ఒక నటుడు స్వయంగా ఎట్లా వుంటాడో, స్టాలిన్ వేషంలో ఎట్లా ఉన్నాడో చూపించే ఫోటోలు కూడా ఇందులో ఉన్నాయి. ఈ నటుడు రష్యాలో ఎక్కడ ఏ సన్మానం జరిగినా బహిరంగంగా స్టాలిన్ వలె వేషం వేసుకుని వెళ్లటానికి అనుమతి ఉన్నదట.

రష్యావారు చారిత్రక చిత్రాలు తీసేటప్పుడు ప్లాస్టిక్ (రబ్బరు) ముఖాలూ, ముక్కులూ, గడ్డాలూ వగైరా అధికంగా వాడతారట.

ప్రదర్శనంలో ఉన్న పోర్టబుల్ సినీ కామెరా చూడటానికి, మన దేశంలో వాడుకలో ఉన్న "ఐమో" కామెరాలాగే ఉన్నది. దానికి 35, 50, 75 లెన్సులు మూడు అమర్చబడి ఉన్నాయి. ఆ లెన్సులకు పసుపు పచ్చ, ఆరెంజి ఫిల్టర్లున్నాయి. సామాన్యంగా "ఐమో" లో మనవాళ్ళు గమనించే లోపాలన్నీ ఈ రష్యన్ కామెరాలో సరిచేయబడ్డాయట.

మన దేశంలో లాగా రష్యాలో సెటింగులకు రంగులు వాడరు; రకరకాల డిజైను గల రంగు కాగితం వాడతారు. సెటింగులు జాజి చెక్కలాటి తేలిక చెక్కతో అమర్చి దానిపై ఈ కాగితం అంటించేస్తారు. నేలకు కూడా కాగితం చదరాతే అంటిస్తారు.

మన దేశంలో లాగా కాక రష్యాలో





"ప్రియురాలు"లో కుమారి గిరిజ జగ్గయ్యను కృష్ణకుమారికన్న ఎక్కువగా ఆకర్షిస్తున్నట్టు కనిపిస్తోంది.

సినిమాలాగే సర్కసుకూడా రోజూ ఆడుతుంది. సినిమా పరిశ్రమలో పని చేసే వాళ్ళలాగే సర్కసులో పనిచేసేవాళ్ళు కూడా విధిగా అయిదేళ్లపాటు శిక్షణ పొంది డిప్లొమాలు పుచ్చుకోవాలట! సినిమాలాగే రష్యాలో సర్కసుకూడా ప్రభుత్వ నిర్వహణకింద ఉన్నది.

రష్యన్ గ్రామఫోను రికార్డులలోని సంగీతం పాశ్చాత్య సంగీతానికికన్న భారతీయ సంగీతానికే సన్నిహితంగా ఉన్నట్టు కనిపిస్తుంది. ముఖ్యంగా కజక్, ఉజ్బెక్ రాష్ట్రాలలోని నృత్యం మన నృత్యానికి చాలా సన్నిహితంగా ఉంటుందట.

ఈ ప్రదర్శనంలో గల గ్రంథాలను గురించి రెండుముక్కలు చెప్పాలి. ఇవన్నీ రష్యన్ భాషలో ఉన్నాయి. వీటిని కనీసం ఇంగ్లీషులోనైనా తర్జుమా చేసుకుంటే మన సినిమా పరిశ్రమకు చాలా ఉపయోగం ఉంటుంది. ఎందుకంటే వీటిలో చాలా గొప్ప శిల్ప విషయాలున్నాయి. మరి కొన్ని గ్రంథాలు ప్రజాసామాన్యానికి ఉద్దేశించినవి. ప్రఖ్యాత రష్యన్ సినిమా తారలను గురించి విడివిడిగా పుస్తకాలున్నాయి. వీటిలో ఆయా పాత్రలు పలు చిత్రాలలో నటించిన పాత్రల వివరాలు ఫొటోలతో సహా ఉన్నాయి. మనదేశంలో కూడా తారలపై ప్రజలకుగల వ్యామోహం తీర్చటానికి కొన్ని గ్రంథాలున్నాయి గాని వాటినిచూస్తే దేశీయసినిమా పరిశ్రమలోనూ దేశచరిత్రలోనూ ఆ తారలు ఎటువంటి పాత్ర వహించినదీ మనకు తెలియదు.

ఈ ప్రదర్శనం సమగ్రమైనది కాకపోయినప్పటికీ మన సినిమాప్రతినిధులు రష్యా వెళ్లి వట్టి చేతులతో తిరిగిరాకుండా రష్యా సినిమా పరిశ్రమను గురించి మనదేశంలో కొంతవిజ్ఞానం వ్యాప్తిఅయేటందుకు వీలుగా ఈ వస్తువులన్నీ తెచ్చినందుకు నిజంగా అభివందనీయులు. రష్యనులు తమ సినిమా పరిశ్రమకు కావలిసిన ప్రతి నల్లపూసనుంచీ తమ దేశంలోనే తయారుచేసుకుంటారట. మనదేశంలాటి వెనుకబడిఉన్న దేశాలు ఈ విషయంలో రష్యాను అనుకరించటానికి ప్రయత్నించాలి. రష్యావారు సినిమా కొరకు జరిపే కృషిలో సగమైనా మన దేశంలో సాగించి సరిఅయిన జాతీయాశయాలను చిత్రనిర్మాణంలో ప్రవేశపెట్టినట్టయితే మన సినిమా పరిశ్రమ ప్రపంచంలోకల్లా అగ్రస్థానం వహించగలదనటానికి సందేహంలేదు.

## సెన్సారు నిబంధనలు

కేంద్ర ఫిలిం సెన్సార్ బోర్డ్‌వారు కలకత్తాలో సమావేశమై చిత్తుకోడ్‌లో కొన్ని సవరణలుచేసి సెన్సార్ నిబంధనలు తయారుచేశారు. ఇవి త్వరలోనే రాష్ట్ర సెన్సార్ బోర్డులకు అందజేయబడతాయి.

కేంద్ర ఫిలిం సెన్సార్‌బోర్డ్ అధ్యక్షుడు సి. ఎం. అగర్వాల్ నవంబరు 7 న కలకత్తాలో పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ ఈ విధంగా చెప్పారు:

"నూతన నిబంధనావళిలో ప్రభుత్వంతో చిత్రనిర్మాతలు సహకరించడం అగ్రస్థానం వహిస్తుంది. చిత్రనిర్మాణం చేసేవారు తమ



విజయావారి "పెళ్లి చేసిచూడు"లో శోభనగృహం. జోగారావు, సావిత్రి—
ఎవరు ఎక్కువ సిగ్గుపడుతున్నదీ తెలియటంలేదు.

"దాసీ" ప్రారంభోత్సవదృశ్యంలో లక్ష్మిరాజ్యం, ఎన్. టి. రామారావు, రంగారావు.
(ఫోటో: శ్రీ వి. కుటుంబరావు)

లాభాలను గురించి ఆసక్తి ప్రదర్శించడం తప్పుకాదు. కాని భారతీయ సమాజిక వ్యవస్థలోని నైతిక ధార్మిక సిద్ధాంతాలకు భిన్నమైన చిత్రాలను నిర్మాతలు తయారు చేయడం కేంద్రబోర్డుకు సమ్మతం కాదు."

నూతన నిబంధనావళి ప్రకారం చిత్ర నిర్మాతలు షూటింగు ప్రారంభించకముందే తమ స్క్రిప్టులను సెన్సార్ బోర్డుకు సమర్పించాలి.

ఏప్రిల్‌లో కొత్త సెన్సార్ బోర్డు ఏర్పాటయినది లగాయితు మూడువిదేశీచిత్రాలూ, ఒక దేశీయ చిత్రమూ పాంతం నిషేధించబడ్డాయి.

బొంబాయి, [illegible], మద్రాసులలోని ప్రాంతీయ సెన్సార్ బోర్డులు చిత్రాలను సెన్సార్ చెయ్యడంలో కొంత సామ్యాన్ని సాధిస్తున్నవనికూడా అగర్వాల్ చెప్పారు.

## ఫిలిం ఫెడరేషన్ అభిప్రాయం

ఇండియా ఫిలిం ఫెడరేషన్ యొక్క కార్యవర్గంవారు కలకత్తాలో 6,7 తేదీలలో సమావేశమైనారు. అధ్యక్షుడు చందూలాల్ షా ఈ సభవారు ఫిలిం విచారణసంఘంవారి నివేదికలోని సూచనలలో ఫిలింకౌన్సిల్ ఏర్పాటుచేసి భారతీయ సినిమా పరిశ్రమకు తోడ్పడాలన్నది ఆమోదించారు; కాని ఆ సంస్థకు సినిమా పరిశ్రమమీద ఎట్టి అజమాయిషి ఉండరాదనీ, ఆసంస్థలో ఒకమూడవవంతు చిత్రనిర్మాతల ప్రతినిధులూ, మరొక మూడవవంతు ప్రభుత్వ నియోగితులూ, మిగిలినవారు సినిమా పరిశ్రమతో సంబంధంగల ఇతరులూ ఉండాలనీ తీర్మానించారు.

## రష్యాలో సినిమా పరిశ్రమ

ప్రసిద్ధ భారతీయ సినిమాతార శ్రీమతి దుర్గాఖోటే అయిదు వారాలపాటు సోవియట్ రష్యాలో పర్యటించి ఈనెల ౫న బొంబాయికి తిరిగివచ్చింది. ఈమె పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ రష్యాలో సినిమా పరిశ్రమనుగురించి ఈవిధంగా చెప్పింది:

రష్యాలో సినిమాపరిశ్రమ ప్రభుత్వ నిర్వహణం కింద ఉన్నది. అయినా అది ఉన్నత ప్రమాణాలను ప్రదర్శిస్తూ లాభదాయకంగా ఉంటున్నది. స్త్రీ పురుషులెవరైనా సోవియెట్ సినిమా రంగంలో ఏవిధంగా ప్రవేశించాలన్నప్పటికీ తాము చేయగోరే పనినిగురించి అయిదేళ్లపాటు ప్రత్యేక విద్య నభ్యసించాలి. ఫిలిం టెక్నిషియనులకూ, నటీనటులకూ ఇదేవిధమైన శిక్షణ ఇవ్వటానికిగాను మనదేశంలోకూడా శిక్షణాసంస్థలు ఏర్పాటు కావాలి. రష్యాలో ఫిలింపనివారికి బహుమానాలూ అవీ ఇచ్చి ప్రోత్సాహం ఇస్తారు.

## రాజ్యం పిక్చర్స్‌వారి "దాసి"

నవంబరు ౫ సోమవారంనాడు ఉదయం 10-40 గంటలకు మద్రాసు రేవతీ స్టూడియోలో రాజ్యం పిక్చర్స్‌వారి తొలి చిత్రం "దాసి"కి ప్రారంభోత్సవం జరిగింది. చిత్ర నిర్మాత లక్ష్మిరాజ్యం, ఎన్. టి. రామారావు, ఎస్. వి. రంగారావు, సూర్యకాంతం మేకప్ చేసుకున్నారు. ఇంకా శాంతికుమారి, రేలంగి, కనకం మొదలైన సమర్థులు ఈచిత్రంలో నటించుచున్నట్టు తెలుస్తున్నది. దీనికి టెక్నిషియనులు కూడా గట్టివారే. కవి, సదాశివబ్రహ్మం; ఫోటోగ్రఫీ, రహమాన్; ఆర్టు, టి. వి. ఎస్. శర్మ; సంగీతం, సుబ్బరామన్; డైరెక్షన్, రంగనాథబాబు.

కథా, పాత్రలూ చాలా బలంగా ఉన్నట్టు చెప్పుకుంటున్నారు.

## అమెరికన్ ఫిలిం కంపెనీలపై బర్మా ఫిర్యాదు

బర్మా ప్రభుత్వం ఇకనమిక్ కో ఆపరేషన్ అడ్మినిస్ట్రేషన్ (ఇ. సి. ఏ.) సాంకేతిక ప్రవీణుల సహాయంతో బర్మాలో కొన్ని డాక్యుమెంటరీ చిత్రాలు తీస్తున్నది. ఈ ఫిలిములు అమెరికాకు పంపబడి అక్కడ ప్రోసెస్ చెయ్యబడుతున్నాయి. ఈ విధంగా అమెకాకు పంపబడిన రెండు డాక్యుమెంటరీ చిత్రాలను మెట్రోగోల్డ్విన్ మేయర్, 20-సెంచరీ ఫాక్స్ సంస్థలు, బర్మా ప్రభుత్వానికిగాని, ఇ. సి. ఏ. టెక్నీషియనులకుగాని తెలియకుండా డిస్ట్రిబ్యూట్ చేశాయట. ఈ సంస్థలపై చర్య తీసుకోవలసినదని బర్మా ప్రభుత్వం బర్మాలోని అమెరికన్ రాయబారి ద్వారా అమెరికా ప్రభుత్వాన్ని కోరిందట.

## "1857"

"1857" అనే పేరుతో ఒక బొంబాయి సినిమా స్టూడియోవారు భారతీయుల తొలి స్వాతంత్ర్య సమరమైన సిపాయి కలహాన్ని చిత్రంగా తయారుచేయనున్నారట. "అంజామ్" చిత్రనిర్మాత శాంతికుమార్ దావే స్వయంగా ఈ కథను తయారు చేస్తున్నాడట. ఆయనకు కమర్ జలాదీ అనే ప్రసిద్ధ ఉర్దూ రచయిత సహాయకుడుగా ఉన్నాడట. ఇందులో ప్రేమనాథ్, రంజన్, టి. ఆర్. రాజకుమారి మొదలైనవారు నటిస్తారని తెలుస్తోంది.

## "సింగారి"

నేషనల్ ప్రొడక్షన్స్‌వారి తమిళ చిత్రం "సింగారి" నవంబరు 9 ఉదయం మద్రాసు పారగన్ టాకీసులో ప్రివ్యూ ఇవ్వబడింది. ఇది పేరుకు సాంఘిక చిత్రమే అయినా కథ కొంతవరకు కృత్రిమంగా ఉండి జానపద చిత్రాలవాసన కలిగి ఉన్నది. అయితే చిత్రంలోని హాస్యసంభాషణలూ, సన్నివేశాలూ ప్రేక్షకులకు ఆనందాన్ని చేకూర్చగలిగి ఉన్నాయి. "సింగారి" పాత్ర ధరించిన లలిత తన పాత్రను చాలా బాగా పోషించింది. పద్మిని, రామచంద్రన్ వగైరా నటులు కూడా బాగా నటించారు. చిత్రంలోని డాన్సులూ, పాటలూ ఒక ప్రత్యేకాకర్షణగా ఉన్నాయి. ★

## సవరణ

### ఆంధ్ర క్రాస్‌వర్డ్సు, రాజమండ్రి

1951 నవంబరు 7వ తేదీ ఆంధ్రపత్రిక-సచిత్ర వారపత్రిక 8వ పేజీలో వెలువడిన "ఆంధ్ర క్రాస్‌వర్డ్సు, రాజమండ్రి, కీ సొల్యూషన్ నెం. 1" ప్రకటనలో 'నిలువు'లో 8వ పదము 'ధ్వని' యని ప్రచురింపబడి యున్నది. 'ధన్వి' యని చదువుకొనవలెను.



దుయీావారి "హిందూస్థాన్ హమారా" హిందీచిత్రంలో నటరాజు (రామగోపాల్)

# మైసూరు కేసు

(3-వ పేజీ తరువాయి)

మార్చవలసిందిగా మైసూరు ప్రభుత్వానికి ఆజ్ఞ ఇచ్చారు.

మైసూరు ప్రభుత్వం, మైసూరు శాసన సభ ఈ ఆజ్ఞను తీవ్రంగా విమర్శించాయి. ఆజ్ఞను ఉపసంహరించుకోవలసిందని రిపబ్లిక్ అధ్యక్షుని కోరుతూ మైసూరు శాసన సభ తీర్మానం చేసింది. దీనిపైనా, శాసన సభ్యుల విమర్శలపైనా అల్లాడి కృష్ణస్వామి, వెంకట్రామశాస్త్రి మొదలైనవార నేతలు వ్యాఖ్యానించారు. మైసూరు న్యాయశాఖామంత్రి కె. టి. భాష్యం గారు మైసూరు ప్రభుత్వ వైఖరిని సమర్థిస్తూ ప్రకటన చేశారు.

371 వ రాజ్యాంగ నిబంధన పార్ట్ 'బి' రాష్ట్రాలుగా మారిన పూర్వసంస్థానాలకు, సంస్థాన కూటాలకు సంబంధించినది. 1950 జనవరి 26 మొదలు పదేళ్ళవరకూ పార్ట్ 'బి' రాష్ట్రాలు రిపబ్లిక్ అధ్యక్షుని ఆజ్ఞలను పాటించాలని విధించబడింది. అయితే ఈ నిబంధన ఫలాని రాష్ట్రానికి వర్తింపచెయ్యనవసరం లేదని రిపబ్లిక్ అధ్యక్షులు ఒక ఆజ్ఞ ద్వారా మినహాయించవచ్చును.

మైసూరు ప్రభుత్వం ఈ మినహాయింపు తెచ్చుకోవాలని కృషి చేస్తోంది. కాని ప్రస్తుత వైఖరిని గమనించినట్లయితే మినహాయింపు ఇవ్వకూడదని కేంద్ర ప్రభుత్వానికి తోచవచ్చును.

ప్రధాన న్యాయమూర్తి ప్రథమ సాక్షిగాగల కేసును మార్చినంతమాత్రం చేత న్యాయస్థానాలను అధిక్షేపిస్తున్నట్లు భావించడం సవ్యంకాదు. చేతలలో వాస్తవంగా నీతిబద్ధులై ఉంటే చాలదనీ, ప్రజలకు తమ నీతి వర్తనలో విశ్వాసం పురిగొల్పడం కూడా అవసరమేననీ నెహ్రూ కాంగ్రెస్ వాదులకు హితవు చెప్పారు. న్యాయనిర్ణేతలు నిష్పక్షపాతంగా నియమబద్ధంగా తీర్పుల నివ్వడంతో తృప్తిపడకుండా ప్రజలలో విశ్వాసం పురిగొల్పాలనేది బ్రిటిష్ న్యాయనిర్ణేతలు పాటించే ముఖ్యసూత్రాలలో ఒకటి. ఇందుకోసమైనా మైసూరు ప్రభుత్వం కేసును మార్చి ఉండవలసింది. అలా చెయ్యక చేజేతులా రిపబ్లిక్ అధ్యక్షుని ఆజ్ఞను వారు కోరి తెచ్చుకున్నారు.

ఇప్పటి పరిస్థితిలో మైసూరు స్వయం పరిపాలనకు భంగం కలుగుతున్నదనీ, అల్ప పరిపాలనా విషయాలలో కేంద్రప్రభుత్వం జోక్యం చేసుకొంటున్నదనీ ఆరోపించడం నీతికాదు.

ఈ కేసుతో భారత జాతీయైక్య సాధనా సమస్యకు అనవసర ప్రాధాన్యం కల్పించినట్లయింది. మద్రాసు, బొంబాయి మొదలైన పార్ట్ 'ఏ' రాష్ట్రాలకు ఇటువంటి రాజ్యాంగ నిబంధన లేనిమాట నిజమే. ప్రజలచేత ఎన్నుకోబడిన శాసనసభలు పార్ట్ 'బి' రాష్ట్రాలలో నేడు మైసూరు, తిరువాన్కూరు - కొచ్చిన్ రాజ్యాలలో మాత్రమే ఉన్నాయి. అందువల్ల మిగతా రాజ్యాల నిమిత్తం ఇటువంటి నిబంధన అవసరమౌతున్నది. ఈ రెండు రాజ్యాలకూ రిపబ్లిక్ అధ్యక్షులు 371 వ నిబంధన వర్తించకుండా ఆజ్ఞ ఇచ్చేవారే కాని, ఈ రాజ్యాలలో రాజకీయ వాతావరణంవల్ల ఇంతవరకూ అట్టి ఆజ్ఞ ఇవ్వలేదని ఇప్పుడు భావించవలసి వస్తుంది.

ప్రస్తుత మైసూరు సమస్యవల్ల ఇప్పుడు రెండు ముఖ్య అంశాలు పరిగణనకు రావచ్చును. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 527 వ సెక్షన్‌ను సవరణచేసి రాష్ట్రప్రభుత్వాల నిర్ణయాలను మార్చగల అధికారాన్ని తీసుకోడం అవసరమని కేంద్ర ప్రభుత్వం భావించవచ్చును. మైసూరు ప్రభుత్వం ఇప్పుడు అధ్యక్షుని ఆజ్ఞను ధిక్కరించ యత్నించినట్లైతే, కేంద్ర ప్రభుత్వానికి ఆహారధాన్యాలను కంట్రోల్ ధరలకు విక్రయించడానికి పంజాబ్ ప్రభుత్వం నిరాకరించినందువల్ల 371వ రాజ్యాంగ నిబంధనను పార్ట్ 'ఏ' రాష్ట్రాలకుకూడా వర్తింపచెయ్యవలసిన అవసరం కేంద్రప్రభుత్వానికి గోచరించవచ్చును. అయితే ఒకటి రెండు రాష్ట్రాలు ఈ రీతిగా చేసినందువల్ల కేంద్రప్రభుత్వం ఇంతటి తీవ్రపరిక్రమకు దిగకపోవచ్చును. అటువంటిది సంభవించకుండా మైసూరు, పంజాబ్, మద్రాసు (వాణిజ్యసుంక విధానంలో కేంద్రప్రభుత్వ నిర్ణయాలను అనుసరించడానికి మద్రాసు ప్రభుత్వం నిరాకరించింది) మొదలైన రాష్ట్రాలు అట్టి అవకాశానికి తావివ్వకుండా ఉండడం అవసరమౌతుంది. ★

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(6-వ పేజీ తరువాయి)

బుసోనీ ఆలీ గబగబ మేడమెట్లు దిగి వెనక తోటలోకి పరుగెత్తారు. వెనకద్వారం తెరిచి కొడరూస్‌ని సమీపించారు.

"అయ్యో! నన్ను చంపేశాడు. బుసోనీ! నన్ను రక్షించండి" అని కొడరూస్ ఏడవ నారంభించాడు.

బుసోనీ ఆలీని చూచి "న్యాయాధికారి విల్‌ఫర్ట్‌ని వెంటనే పిల్చుకురా. వెళ్ళు. దారిలో డాక్టర్ని పిలిచి ఇక్కడికి పంపు" అన్నాడు.

"ఇంక డాక్టర్ వల్ల లాభంలేదు. నేను చచ్చిపోతున్నాను. హంతకు డెవరో చెప్తాను. త్వరగా న్యాయాధికారిని పిలవండి" అన్నాడు కొడరూస్ ఆయాసపడుతూ. నెత్తురు ధారలుకట్టింది.

"నిన్ను పొడిచిన దెవరు?" అన్నాడు బుసోనీ.

"బెనెడెట్టో. వాడే ఈయింటి ఆచోకీ అంతా నా కిచ్చి దొంగతనం చెయ్యమన్నాడు. మాంట్ క్రిస్టోని నేను చంపితే, ఆయన భాగ్యమంతా తనకు వెంటనే వస్తుందనుకున్నాడు. లేక ఆయనే నన్ను చంపితే, తనకి నాపీడ వదలిపోతుం దనుకున్నాడు. అందుకే ఈ ఉచ్చుపన్ని నన్నిప్పుడు పొడిచాడు."

"ఆగు. నువ్వు చెప్పినదంతా నేను వ్రాస్తాను. నువ్వు చివర సంతకం చెయ్యి."

బుసోనీ గబగబ ఇల్లు ప్రవేశించి కలం, కాగితం తెచ్చాడు. "తూలన్ ఖైదులో నాతోపాటు ఖైదీగా ఉన్న బెనెడెట్టో అనే 59 నంబరు నన్ను పొడిచాడు." అని మాంట్ క్రిస్టో వ్రాశాడు. కొడరూస్ కలం అందుకుని వొణుకుతున్న చెయ్యితో సంతకంపెట్టాడు.

"నే చెప్పిందంతా న్యాయాధికారికి చెప్తారు కాదూ?" అన్నాడు కొడరూస్.

"తప్పకుండా. అంతే కాదు. ఇంకో చెప్తాను. నువ్వు దొంగతనం చెయ్యబోతున్నావని మాంట్ క్రిస్టోకి ఉత్తరంవల్ల తెలియపరిచాడని కూడా చెప్తాను. నీకు తెలియకుండా నిన్ను వెన్నాడివచ్చి నువ్వీఇంటిలో ప్రవేశించడం గమనించాడు. నువ్వు నిచ్చెన దిగగానే చీకటి చాటునుంచి వచ్చి పైన పడి పొడిచాడు."

"మీ రిదంతా చూస్తూనే ఉన్నారా? నన్ను వాడు చంపుతోంటే చూస్తూ ఊరుకున్నారా? అయ్యో నన్ను వెన్నాడుతున్నాడని నాకెందుకు చెప్పలేదు?"

"మొదటే అన్నాను కదా! నువ్వు క్షేమంగా వీధిదాటి ఇల్లు చేరుకోగలిగితే, నిన్ను భగవంతుడు క్షమించాడనుకుంటాను. అప్పుడు నేనూ నిన్ను క్షమించగలననుకున్నాను. నిన్ను భగవంతు డేం చెయ్యదల్చుకున్నాడో, అదంతా బెనెడెట్టో చేతులలో పెట్టాడని నా అభిప్రాయం—భగవత్కార్యాన్ని నిరోధించడం మహాపాతకం."

"భగవత్కార్యమా! భగవంతుడు గుడ్డివాడు, న్యాయాన్యాయాలు తెలియని అంధుడు. భగవంతుడే న్యాయనిర్ణేతఅయితే, ఈనాడు నిశ్చింతగా తిరుగుతున్న వారు శిక్షపాలు పడవలసిందే."

"ఇటు విను. చనిపోయేటప్పుడు కూడా నువ్వు భగవంతుని నమ్మడంలేదా? నిన్ను భగవంతు డెంత రక్షించి కనికరించాడో నీకు తెలుసునా? నీకు పుష్టిఅయిన శరీర మిచ్చాడు. బల మిచ్చాడు. వృత్తిఇచ్చాడు. ఉపాధి కల్పించాడు. మిత్రుల నిచ్చాడు. పాప చింతన లేనివారు సుఖపడ్డానికి అవసరమైన సాధనాలన్నీ నీకు సమకూర్చాడు. కాని నీ మిత్రునిపట్ల నువ్వు ద్రోహంచేశావు. అయినా భగవంతుడు నిన్ను శిక్షించకుండా కనికరించాడు. కాని నీ కళ్లు తెరవడానికి నిన్ను దారిద్ర్యంలో ముంచాడు. మర్యాదగా, సద్వర్తనతోనే ఆర్జించగల దానిని లోభంవల్ల పాపచింతవల్ల చెడగొట్టుకున్నావు. దారిద్ర్యం పేరు చెప్పి సోదరమానవులపైఅత్యాచారాలు చెయ్య నారంభించావు. భగవంతు డొకసారి నీకు అపారమైన ధనం పంపాడు. అది నీకు చాలలేదు. హత్యవల్ల దాన్ని రెట్టింపుచేసుకున్నావు. అందువల్లనే మళ్ళీ భగవంతుడు నిన్ను దరిద్రుణ్ని చేసి శిక్షించాడు."

కొడరూస్ స్థిమితంగా ఉండలేక మూలుగుతూ అటూ ఇటూ పొర్ల నారంభించాడు.

"బందీగా ఉన్న నిన్ను కరుణించి భగవంతుడు దారి చూపాడు. విల్మోర్ నీకు ఉపాధి కల్పించాడు. కాని మళ్ళీ భగవంతుని మోసంచేసి శిక్ష పొందావు."

"అవును. కాని బెనెడెట్టో తప్పించుకుంటున్నాడూ."

"ఎవరూ తప్పించుకోలేరు. భగవంతుడు వాడినికూడా శిక్షిస్తాడు."

"అయితే నన్ను చంపుతూంటే చూస్తూ ఊరుకున్న మిమ్మల్నికూడా భగవంతుడు శిక్షిస్తాడు."

"నా న్నా?" అన్నాడు బుసోనీ చిరునవ్వుతో. "నీలో పశ్చాత్తాపం కనపడితే నిన్ను తప్పకుండా రక్షించేవాడినే. కాని నన్ను కత్తితో పొడవబోయినావు. ఇంక నిన్ను భగవంతుని పాదాలముందే విడిచిపెట్టడం మంచి దనుకున్నాను."

"భగవంతుడు లేడు. ఉన్నాడని మీ కొక నమ్మకంలేదు. నాతో అబద్ధమాడుతున్నారు."

"ఆగాగు. నిన్ను శిక్షిస్తున్నప్పటికీ భగవంతుని నమ్మవా? ఒక్కమాటతో, ఆఖరు ప్రార్థనతో క్షమించగల భగవంతునే నమ్మడంలేదా? ఆలోచించుకో. నీ మనస్సు మార్చుకో. పశ్చాత్తాప పడు."

"అయినా, ఎవరు మీరు?" అన్నాడు కొడరూస్ తేరిపార చూస్తూ.

"చూడు. సరిగ్గా చూడు నా వంక" అన్నాడు బుసోనీ. కొవ్వొత్తి దీపం తన ముఖంవద్దకు తీసుకున్నాడు.

"ఎవరు? మీరు బుసోనీ!" అన్నాడు కొడరూస్.

బుసోనీ టోపీ తీసివేశాడు. తరవాత విగ్గు తీసేశాడు.

"ఆ! మీరు విల్మోర్!"

"కాదు. నేను పాదరీని కాను, విల్మోర్‌ని కాను. సరిగ్గా చూడు. నన్ను గుర్తుపట్టలేవా?" మాంట్ క్రిస్టో మాటతీరులో చిత్రమైన మార్పువచ్చింది. కొడరూస్ మనస్సులో కలవరం బయలుదేరింది.

"ఎవరు? అవును. ఎక్కడో ఎప్పుడో మిమ్మల్ని చూసి నట్లే ఉంది. మిమ్మల్ని బాగా తెలుసు ననిపిస్తోంది."

"అవును. నన్ను చూశావు. ఒకప్పుడు నన్ను చక్కగా ఎరుగుదువు."

"అయితే మీ రెవరు?"

ఇంక కొడరూస్‌కి అంత్యఘడియలు సమీపించాయని మాంట్ క్రిస్టో గ్రహించాడు. మెల్లిగా వొంగి కొడరూస్ చెవిలో "నేను..." అంటూ రహస్యంగా చెప్పాడు. కొడరూస్ ఉలిక్కిపడ్డాడు. చేతులెత్తి భగవంతునికి నమస్కరించాడు. "అయ్యో! భగవంతుడా! పాపాత్ముణ్ని నన్ను క్షమించు. నన్ను నీలో చేర్చుకో." అన్నాడు. ఒక్క సారిగా బిగ్గరగా మూలిగాడు. తల వాల్చేశాడు.

"ఒకడు" అన్నాడు మాంట్ క్రిస్టో, శవంపైన చూపులు నిగిడ్చి. మెల్లిగా లేచి నిలిచాడు.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras



అమెరికాలో ఏటా అక్టోబరు 12 కొలంబస్ దినంగా జరపబడుతుంది
కొలంబస్ అమెరికాను కనిపెట్టాడు

